# హిందీ ప్రచారోద్యమము - దాని స్వరూపము

రచన :
శ్రీ ఎం. పి. దేశాయి

అనువాదము :
శ్రీ దశిక సూర్యప్రకాశరావు

"ఇగ్లీషు లేకుండ మన పనిపాటలు సాగవు అనుకొనుట
మన మనస్సును బట్టుకొన్న దాస్యభూతమువల్లమాత్రమే.
ఈ నిరాశాపద్ధతిని నేనెన్నడును అంగీకరింపజాలను."

— గాంధీజీ.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ - ఆంధ్ర
959, ఖైరతాబాదు - హైదరాబాదు
1959

డెబ్బది అయిదు నయాపైసలు

# మనవి

జాతి పిత మహాత్మాగాంధి గారు 1909 లోనే భారత జాతీయ భాషగా హిందీని గుర్తించారు. 1918 లో దక్షిణ దేశంలో దక్షిణ భారత హిందీ ప్రచారసభను స్థాపించి, ఆ భాషావ్యాప్తికి పూనుకొన్నారు. భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమంతోబాటు హిందీ ఉద్యమం గూడా మహాత్ముని ఆశీర్వాద బలంతో మూడు పూవులూ, ఆరు కాయలుగా అభివృద్ధిని పొందింది. "ఇంగ్లీషు పరభాష, హిందీ భారతీయ భాష. కనుక హిందీయే మన రాజభాష" అనే విషయాన్ని ఈనాడు గుర్తించని వారు లేరు. అయినా ఇంగ్లీషు యెడల మనకు గల వ్యామోహం ఇంకా తగ్గినట్లు కనపడడంలేదు. ఇంగ్లీషే మన రాజభాష అనే వాదంగూడా అక్కడక్కడ వినవస్తున్నది. హిందీ మనకు రాజభాషగా ఎందువల్ల ఉండవలసిన అవసరమున్నదో శ్రీ మగన్‌భాయీ దేశాయిగారు యీ పుస్తకములో వివరించియున్నారు. హిందీ ప్రచారోద్యమ స్వరూపాన్ని కూడా శ్రీ దేశాయిగారు వివిధ దృక్పథాలతో చర్చించియున్నారు. ఈ పుస్తకమును అనువదించి ప్రచురించుకొనుటకు అవకాశమిచ్చిన శ్రీ మగన్‌భాయి దేశాయిగారికి, యీ పుస్తకమును తెలుగులోనికి అనువదించిన శ్రీ దశిక సూర్యప్రకాశరావుగారికి మా ధన్యవాదములు.

హైదరాబాదు,
ది. ౨౪-౪-౫౯

వేమూరి ఆంజనేయ శర్మ
కార్యదర్శి

# హిందీ ప్రచారోద్యమము

## ప్రారంభము

భారతదేశములో అనేక భాష లున్నవి. కనుక స్వతంత్ర భారతములో ఏది జాతీయభాషగా ఉండదగునో, దాని నడక ఎట్లుండవలెనో, దాని కార్యపద్ధతి ఎట్టిదో ఈ సంగతులు స్పష్ట ముగా తెలిసికొనుట అవసరము. వీనిని స్పష్టముగా నిర్దేశించి ప్రజలకు తెలియజేయవలెను. ఈ విషయము లన్నియు మనము "రాజ్యాంగము"లో పొందుపఱచి యుంటిమి. (17 వ భాగములో 343-351 సెక్షనులు చూడుడు.) స్వతంత్రభారతములో ఉండవల సిన భాషాస్వభావ మెటువంటిదో, స్వతంత్ర ప్రజాతంత్ర రాజ్యము ఏర్పడుటకు గాను ఆ భాష ఏ రూపములో నుండవలెనో అందు స్పష్టముగా తెలియజేయబడెను.

రాజ్యాంగములో అట్టి భాషారూపమును నిర్దేశించుటకు గాను అంతకుమునుపు ప్రబలమయిన ఆధారములు గలవు. లోగడ ప్రజలు దేశమున కంతకును ఒక్క జాతీయభాష కావలెనని ఎంతో పాటుపడియున్నారు. ఆనాడు వారు వేసిన బాటయే, ఈనాడు "రాజ్యాంగ" రచయితలకు భాషాస్వరూప నిర్ణయము చేయుటకు ఉపకరించినదని చెప్పవచ్చును.

ఈ ప్రయత్నములు సుమారొక యేబది సంవత్సరముల కాలము జరిగినవి. ఆ చరిత్ర ఇంకను వ్రాయవలసియే యున్నది. భారత రాజ్యాంగ విధానములో నిర్దేశింపబడిన భాషా స్వరూపమును తెలిసికొనుటకు గాను పై ప్రయత్నములను కొంతవఱకయినను తెలిసికొనుట అవసరము.

## 1. భారతీయ భాషాసమస్య

1915 లో గాంధీజీ భారతీయ రంగముపై పొడసూపి యున్నారు. వారిక్కడకు రాకపూర్వమే పడమటి భారతదేశములోని కొందఱును, తూర్పుభారతములోని మఱికొందఱును, ఉత్తర భారతములోని జనులందఱివల్లను మాట్లాడబడు భాషయే యావద్దేశమునకును సామాన్య భాషగా ఉండదగునను అభిప్రాయములు వెలిబుచ్చి యుండిరి. ఏమయినను, గాంధీజీ రంగస్థలములో ప్రవేశించి జాతీయభాషా విషయమయి చేసిన కృషియే హిందీ ప్రచారోద్యమ చరిత్ర యని మనము స్పష్టముగా చెప్పవచ్చును. గాంధీజీ ఈ విషయమును గుఱించి 1909 లోనే తమ "హింద్ స్వరాజ్" అను గ్రంథములో యీ విధముగా పొందుపఱచి యున్నారు.

"పాఠకుడు : ఇక మన విద్యాపద్ధతి యెట్లుండవలెను ?"

"సంపాదకుడు : ఇంతకుపూర్వమే ఈ సంగతి చెప్పబడెను. మరల ఇంకను విచారింతము. మన భాషల నన్నిటిని మనము వృద్ధిచేయునవలెను. మనము ఆ భాషల ద్వారా ఏయే విషయములు నేర్చుకొనవలెను అన్న సంగతి ఇప్పుడు అప్రస్తుతము. ఉత్తమ ఇంగ్లీషు గ్రంథములను మన భారతీయ భాషలన్నిటిలోనికిని అనువాదము చేసికొనవలెను. ప్రకృతిశాస్త్రముల నన్నిటిని పుక్కిటబట్టవలెనను కపటోద్దేశమును

మనను విడిచిపెట్టవలెను. మన విద్యావిధానములో, ధార్మిక విద్య అనగా నైతిక సూత్రములు బోధించు విద్యకు అగ్రస్థానమీయవలెను. విజ్ఞానవంతుడగు ప్రతి భారతీయుడును మునుముందుగా తన ప్రాంతీయ భాషను నేర్చుకొనవలెను. అటు పిదప హిందువుడయినచో సంస్కృతమును, మహమ్మదీయుడయినచో అరబ్బీని, పార్సీ అయినచో పారసీ భాషను మొత్తమున కందఱును హిందీ నభ్యసింపవలెను. కొందఱు హిందువులు అరబ్బీ పారసీ భాషలను, కొందఱు మహమ్మదీయులును, పార్సీలును సంస్కృతమును అభ్యసింపవలెను. పెక్కండ్రు ఉత్తర భారతీయులును, పశ్చిమ భారతీయులును తమిళభాషను నేర్చుకొనవలెను. యావద్భారతీయ భాషగా 'హిందీ' ఉండవలెను. అయితే ఆ భాషను నాగర లిపిలో గాని, ఉర్దూ లిపిలో గాని వ్రాయుటకు సావకాశమివ్వవలెను. హిందువులును, మహమ్మదీయులును పరస్పర మైత్రి కలిగియుండుటకు గాను, ఉభయులును రెండు లిపులను నేర్చుకొనుట అవసరము. ఈ పని మనము చేయగలిగిన, ఇంగ్లీషును అచిరకాలములో రంగస్థలమునుండి తఱిమివేయగలము. బానిసలమయిన మనము ఇంతమాత్రము అవశ్యము చేయవలెను. మనము బానిసలమగుటవల్లనే మన దేశము బానిసదేశము అయిపోయినది. మనము స్వతంత్రులమయిననాడు దేశముస్వతంత్రముకాగలదు."

ఇక్కడ, భాషాసమస్యను గుఱించి స్పష్టమయిన అభిప్రాయము చెప్పబడినది. ఇది చాల ప్రధానవిషయము. భారతీయ భాషలను పెంపొందించి, యావద్దేశీయభాషగా హిందీని వృద్ధిచేసి ఇంగ్లీషును తీసివేయవలసినదని స్పష్టపడినది. ఉత్తర భారతీయులు మాట్లాడుకొను "హిందీ", జాతీయభాషయగు హిందీకి ప్రాతిపదికగా నుండగలదు. డాక్టరు ఎం. ఎస్. పటేలు తమ డాక్టరు పట్టము పొందుటకుగాను "మహాత్మాగాంధి విద్యాతత్త్వము" అన్న విషయముపై దీర్ఘవ్యాసము వ్రాయుచు, అందు ఈ క్రింది విధముగా వ్రాసియున్నారు.

"ఇరువదవ శతాబ్ది ప్రారంభమున విద్యావంతులయిన భారతీయులు, "ఇక మనదేశములో ఇంగ్లీషు రాజభాషగా ఏర్పడిపోయినది. గనుక పాఠశాలలలో తరగతులన్నిటిలోను విద్యామాధ్యమముగా ఇంగ్లీషే ఉండగలదు" అని నమ్మి

యుండిరి. ఇంగ్లీషు దొరల వేషభాషలను అనుకరించుట ఫ్యాషను అని తలచు చుండిరి. ఇంగ్లీషు చక్కగా మాట్లాడలేనివారిని "చచ్చునాగమ్మల" క్రింద లెక్కకట్టు చుండిరి. ఎవరో ఒకరిద్దఱు ఈ విధముగా తలచియుండలేదు. విద్యావంతులయిన వారందఱు ఒక జట్టుగా ఏర్పడి ఇట్టి భేదబుద్ధినిగలిగియుండిరి. భారతీయ జీవితము నకు పరభాషా ప్రాధాన్యము వల్ల గలుగుచున్న అనర్థములను గుర్తించిన భారతీయులు పెక్కుండ్రు లేరు. కొద్దిమంది మాత్రమే గలరు. వారిలో గాంధీజీ ఒకరు. వారీసంగతి కనిపెట్టి భారతీయ భాషలను అనాదరించి, ఇంగ్లీషుభాషకు పట్టముకట్టుట తప్పని ఏనాడో 1909 లోనే ప్రకటించియుండిరి. ఈ విధముగా గాంధీజీచే ప్రారంభింపబడిన ఈ ఉద్యమము నలువది సంవత్సరముల దీర్ఘకాలము సాగినది. చివరకు 1949 లో రాజ్యాంగపరిషత్తులో హిందీభాషకొక రూపకల్పన చేయబడినది. ఈ లోపున భాషా పండితులందఱు తీవ్ర వాదోపవాదములు చేయుచుండిరి. దీనికి తోడు, విదేశీ రాజులచే ప్రేరేపింపబడిన మతకలహముల వల్లను ఈ వివాదము మఱికొంత తీవ్రమయినది."

## 2. హిందీ ఎందుకు ?

1917 లో భరూచి గ్రామములో, గుజరాతు రెండవ విద్యా మహాసభ జరిగినది. దానికి గాంధీజీ అధ్యక్షులు. వారు తమ అధ్యక్షోపన్యాసములో, ఇండియాలో మొట్టమొదటిసారి హిందీ ఉద్యమమును గుఱించి ప్రస్తావించియుండిరి. తాము ఇంగ్లీషును ఎందుకు తిరస్కరించినదియు, దేశములో ఎన్నో భాషలుండగా హిందీనే జాతీయభాషగా ఎందుకు వరించినదియు వారు స్పష్టముగా తెలియబఱచి యుండిరి. ఆ ప్రకటన నాటికిని నేటికిని విలక్షణముగాను విశిష్టముగాను ఉండనేఉన్నది. దానిని కొంత విపులముగానే ఈ క్రింద పొందుపఱచెదను.

"ఇంగ్లీషు మన జాతీయ భాష కాగలదేమో, ఆ సంగతి మొట్టమొదట విచారింతము. మనలో కొందఱు విద్యావంతులున్నారు. వారు మంచి దేశభక్తులు

కూడ. "ఇంగ్లీషు ఇప్పటికే జాతీయ భాష అయిపోయినది, ఇప్పుడిక జాతీయ భాషను గురించి మరల ప్రస్తావించుట తెలివితక్కువే కాగలదు" దని వారు వాదించు చుందురు. స్థూలముగా విచారించిన, ఈ అభిప్రాయము సరిగా ఉన్నట్లే మనకు తోచును. మన విద్యావంతుల పద్ధతిని బట్టి చూచినయెడల, ఇంగ్లీషు లేకుండ మన వ్యవహారము ఒక్క పూట కూడ గడవనట్లు తోచును. కాని కొంత లోతుగా ఆలోచించినయెడల ఇంగ్లీషు ఎన్నటికిని మన జాతీయ భాష కాజాలదనియు, అట్లు అది కాగూడదనియు మనకు తెలియగలదు.

జాతీయ భాషకు కావలసిన లక్షణము లేమో విచారింతము.

1. గవర్నమెంటు ఉద్యోగులు ఆ భాషను సులభముగా నేర్వవలెను.

2. యావద్భారత దేశములో, (మత) ధార్మిక, ఆర్థిక, రాజకీయ విషయము లను ప్రసరింపజేయుటకు ఆ భాష సమర్థనీయమయి యుండవలెను.

3. ఆ భాష, యావద్భారత దేశములో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడున దయి యుండవలెను.

4. ఆ భాష, దేశములోని ప్రజలందఱును సులభముగా నేర్వదగినదయి యుండవలెను.

5. ఆ భాషను ఎంచుకొనునప్పుడు తాత్కాలిక లాభములను మనస్సులో పెట్టుకొనరాదు.

ఇంగ్లీషునకు పై చెప్పిన లక్షణములలో ఒక్కటి కూడ పట్టదు.

మొదట చెప్పిన లక్షణము చివర చెప్పదగినది. కాని నేను ఉద్దేశపూర్వకము గానే దానిని మొదట చేర్చితిని. కారణ మేమనగా, ఇప్పటి కప్పుడే ఇంగ్లీషు ఆ విధముగా సులభమయిపోయినదని మనవారు కొందఱు తలచుచున్నారు. కాని సూక్ష్మ పరిశీలన చేసినయెడల, మన గవర్నమెంటు ఉద్యోగులకు, ఇప్పటికి కూడ, ఆ భాష నేర్చుకొనుటకు గాని, వ్యవహరించుటకు గాని సులభ మయినది కాదని తెలియగలదు. ఇప్పుడు మనకున్న రాజ్యాంగ చట్టప్రకారము, క్రమక్రమముగా ఇంగ్లాండు దేశస్థులగు ఉద్యోగులు తగ్గిపోవునట్లును, వైసురాయివంటి వారు ఒకరో యిద్దరో మిగిలియుండునట్లును, ఏర్పాటుచేయబడినది. ఇప్పటికే గవర్నమెంటు ఉద్యోగములలో భారతీయులే అధిక సంఖ్యాకులుగా నున్నారు. కాలము గడచిన కొలది వారి సంఖ్య ఇంకను పెరుగగలదు. దీనికి ఎవరును ఆక్షేపణ చెప్పరను

కొందును. అటువంటి వారికి ఇంగ్లీషు భాష మిక్కిలి కష్టముగా నుండగలదు. మిగిలిన భాషలు తేలికగా నుండగలవు.

ఇక రెండవ లక్షణము : మన దేశములో నున్న ప్రజలందఱును ఇంగ్లీషు నేర్చుకొన్న గాని, దేశమందంతటను ఇంగ్లీషు ద్వారా ధార్మిక (మత) వ్యాసంగము చేయుట అసాధ్యమే కాగలదు.

- మూడవ లక్షణము : మన దేశములోని అత్యధిక సంఖ్యాకులు ఇంగ్లీషు మాట్లాడుచుండుట లేదు.

నాలుగవ లక్షణము ; భారతీయులందఱు నేర్చుకొనుటకు ఇంగ్లీషు సులభ మయినది కాదు.

అయిదవ లక్షణము : ఈ నాడు ఇంగ్లీషునకు గల హోదా తాత్కాలిక మయినది. భారత జాతీయ వ్యవహారములలో ఒకవేళ ఇంగ్లీషు అవసరమయిన యెడల, అట్టి సందర్భములు మిక్కిలి అల్పముగా నుండును. సామ్రాజ్య వ్యవహార ముల కా భాష తప్పక కావలసియుండును. సామ్రాజ్యములో అంతర్భాగములగు రాజ్యముల మధ్య రాజకీయ వ్యవహారములు నడుపుటకు ఆ భాష ఉపయోగపడ గలదు. అందుకు ఇంగ్లీషు అవసరమే. మనము ఇంగ్లీషును ద్వేషించుటలేదు. కాని అది హద్దుమీఱి మాత్రము పైకి రాగూడదనియే మన స్పష్టమయిన అభిప్రాయము. సామ్రాజ్య వ్యవహారములకు ఇంగ్లీషు ఉపకరించునది గనుక మన మాలవ్యా, శాస్త్రీ, బెనర్జీలవంటి పండితులు ఆ భాషను నేర్చుకొని వారు పోయిన ప్రతిచోటను భారతదేశ గౌరవమును పెంపొందునట్లు వ్యవహరింపవలెనని కోర దగుదురు. అంతేకాని, ఇంగ్లీషు భారతదేశమునకు జాతీయ భాష కాజాలదు. ఇంగ్లీషు మనకు జాతీయ భాష కాగలదని తలచుటవలన మన దౌర్బల్యము, అజ్ఞానము మాత్రమే వెల్లడికాగలవు.

అయిన ఇక పై అయిదు లక్షణములు గలిగిన భాష యేది ? ఆ భాష హిందీయే యని మనము ఒప్పుకొనక తప్పదు. ఉత్తరభారతదేశములో హిందువులు, ముసల్మానులు దేనిని మాట్లాడుచుందురో, దేనిని నాగరి, ఉర్దూ లిపులలో వ్రాయు చుందురో, దానినే 'హిందీ' యని నేను చెప్పుచున్నాను.

నేను చెప్పిన ఈ పరిభాష అందఱకు నచ్చలేదు. హిందీ, ఉర్దూలు రెండును వేఱు వేఱు భాషలని వారి అభిప్రాయము. కాని ఇది సరియయిన మాటకాదు. ఉత్తర భారతములో హిందువులు, ముసల్మానులు ఒకే భాష మాట్లాడెదరు. కాని

భిన్న భాషలను విభేదము ప్రవేశపెట్టినది విద్యావంతులే. విద్యావంతులయిన హిందువులు తమ హిందీ భాషలో సంస్కృత శబ్దములను బహుళముగా ప్రవేశపెట్టి యున్నారు. అవి ముసల్మానులకు అర్థముకావు. అట్లే లక్నోలోని ముసల్మానులు తమ ఉర్దూ భాషలో పారశీక శబ్దములను అధికముగా చేర్చియున్నారు. అవి హిందువులకు కొఱుకుడు పడవు. సామాన్య ప్రజలకు ఈ రెండు భాషలును నిరుపయోగకరములే, నేను ఉత్తర భారతములో నివసించియున్నాను. నాకు వచ్చిన హిందీ అల్పమే అయినను, దానితో అక్కడ నున్న హిందూ ముసల్మాను లతో వ్యవహరించుటకు నాకు ఇబ్బంది కలుగనే లేదు. కనుక మీరు హిందీ అనండి, ఉర్దూ అనండి. ఉత్తర భారత ప్రజలు మాట్లాడు భాష ఒక్కటే. ఉర్దూ లిపిలో వ్రాసినయెడల అది ఉర్దూ, నాగరిలో వ్రాసిన యెడల హిందీ కాగలదు.

ఇక మనము లిపిని గురించి ఆలోచింపవలెను. ముసల్మానులందఱు తప్పక ఉర్దూ లిపినే వాడుక చేయుచుందురు. హిందువులలో అధికసంఖ్యాకులు నాగరిలిపిని వాడుచుందురు. అధికసంఖ్యాకు లనుటకు కారణమేమనగా వేలకువేలు హిందువులు నేటికిని ఉర్దూ లిపినే వాడుచున్నారు. మఱికొందఱకు నాగరిలిపి రానేరాదు. హిందు వులకు, ముసల్మానులకు పరస్పరము గలిగిన అవిశ్వాసము, అనుమానము తొలగి పోయిన యెడల, ఏ లిపియందు అధిక శక్తి యుండునో, అదే జాతీయ లిపిగా నిలువగలదు. (గాంధీజీ, తమ జీవితాంతము వఱకును లిపిని గురించి ఈ అభి ప్రాయమునే గలిగియుండిరి. వారిట్లు వ్రాసియున్నారు. "నాగరి, ఉర్దూ లిపులలో చివరకు గెలుపొందునది నాగరి లిపియే యని నేనును అంగీకరించుచున్నాను. ఆ విధముగా భాషావిషయమయి ఆలోచించిన యెడల చివరకు హిందుస్తానీయే జయింపగలదు. కారణమేమనగా సంస్కృత శబ్దములు అధికముగా గల హిందీ, పర్షియను అధికముగా గల ఉర్దూ, ఈ రెండును అస్వాభావికములును, కృత్రిమ ములు నయియున్నవి. హిందుస్తానీయో స్వాభావికమయినది." "జాతీయభాషను గుఱించిన భావములు" అను గ్రంథము పుట 187 చూడుడు) ఈ మధ్యకాలములో హిందువులు, ముసల్మానులు తమ అర్జీలను ఉర్దూ లిపిలో వ్రాయదలచిన యెడల అట్లు వ్రాయవచ్చును. వానిని గవర్నమెంటు కార్యాలయములన్నిటిలోను స్వీకరింప వలెను.

ఈ అయిదు లక్షణాలు గలిగియుండి 'హిందీ' తో పోటీ చేయగల భాష మఱియొకటి లేదు. హిందీ, భారతజాతీయ భాషగా ఈ వఱకే స్థిరపడిపోయినది.

ఈ విధముగా చిరకాలమునుండి దానిని వాడుక చేయుచున్నాము. ఈ కారణము వల్లనే ఉర్దూభాష కూడ జన్మించినది.

ముసల్మాను రాజులు అరబ్బీని గాని, పార్సీని గాని జాతీయభాషగా చేయలేకపోయినారు. వారు హిందీ వ్యాకరణమునే అవలంబించినారు. అయితే మాట్లాడునప్పుడు ఎక్కువగా పార్సీ మాట ఉపయోగించిరి. వ్రాయునప్పుడు ఉర్దూ లిపిని వాడుకచేసిరి. సామాన్యప్రజలతో వ్యవహరించుటకు వారికి విదేశీభాష అనుకూలింపలేదు. ఇంగ్లీషు రాజులు చేసిన పనియు అదియే. వారు సిపాయిలతో వ్యవహరించునప్పుడు హిందీ లేక ఉర్దూ మాటలను ఉపయోగించుచుందురు. తత్సంబంధమున్న వారికి ఈ సంగతి తెలియును.

కాబట్టి ఏ విధముగా చూచినను 'హిందీ' ఒక్కటియే జాతీయభాష కాదగునని తెలియగలదు.

ఇంగ్లీషు ప్రజల అందుబాటులోనికి పోలేకపోయినది. కాని హిందీ అతి శీఘ్రకాలములో ప్రజలసన్నిధికి చేరగలదు. ఏ భాష మనకు జాతీయభాషగా ఉండదగునో ఆ విషయమయి ఈ మహాసభవారు ఒక నిశ్చయమునకు వచ్చినయెడల ఆ భాషావ్యాప్తికి ఏమిచేయవలెనో ఆలోచింపవచ్చును. మాతృభాషను పెంపు చేయుటకు చెప్పబడిన పద్ధతులే, కొద్ది మార్పులతో, జాతీయ భాషాభివృద్ధికిని వర్తింపగలవు. గుజరాతీని బోధనామాధ్యమముగా చేయు పూచీ కేవలము మనదే. కాని జాతీయభాషా ప్రచార బాధ్యత దేశమంతటిది.

## 3. హిందీ అనగా నేమి ?

మఱుసంవత్సరము అనగా 1918 లో ఇందూరులో జరుగు హిందీ సాహిత్య సమ్మేళన సమావేశమునకు అధ్యక్షులుగా నుండవలసినదని గాంధీజీని ఆహ్వానసంఘమువారు ప్రార్థించియుండిరి. ఈ సంస్థ హిందీప్రచారము చేసిన బాగుండునని గాంధీజీ అభిప్రాయపడిరి. ఈ విధముగా హిందీ ప్రచారోద్యమములోని మొదటిదశ ప్రారంభమయినది. అది 1935 వఱకును సాగినది. అప్పుడు మఱల ఇందూరులోనే రెండవ పర్యాయము, హిందీ సాహిత్య

సమ్మేళన సమావేశము జరిగినది. ఈ పర్యాయము కూడ గాంధీజీయే అధ్యక్షులుగా నుండిరి.

మొదటిదళ మిక్కిలి ప్రధానమయినది. కారణమేమనగా హిందీ అనగానేమో, ఆ భాషవలన గలుగు ప్రయోజనమేమో ఆ దళలో స్పష్టము చేయబడెను. గాంధీజీ ఈ విషయములనే తమ అధ్యక్షోపన్యాసములో ఈ క్రిందివిధముగా వివరించియుండిరి.

'ఉత్తర భారతములో హిందూముసల్మానులు మాట్లాడునట్టిదియు, నాగరిలో గాని ఉర్దూలిపిలో గాని వ్రాయబడునట్టిదియు హిందీభాష యని నేను పలుమారులు చెప్పియున్నాను. ఈ హిందీభాషలో సంస్కృత శబ్దములు గాని, పారసీ శబ్దములు గాని బహుళముగా నుండవు. ఈ గ్రామీణ హిందీలో నాకు లభించిన భాషా మాధుర్యము, లక్నోలోని ముసల్మానుల భాషలో గాని, ప్రయాగలోని హిందూ పండితుల భాషలోగాని నాకు లభింపలేదు. సామాన్య జనులందరకును అర్థమగు భాషయే సర్వోత్తమమయినది. గ్రామీణ హిందీని సర్వులును అర్థముచేసికొన గలరు. ప్రజలు హిమాలయములవంటివారు, అక్కడనుండి భాషాస్రవంతులు బయలుదేరవలెను. ఇది శాశ్వత ధర్మము. హిమాలయములలో పుట్టిన గంగ శాశ్వతముగా ప్రవహించుచునే యుండును. ఆ విధముగానే గ్రామీణహిందీ, నిత్య నూతనశోభతో కలకలలాడుచు సదా ప్రవాహగతిని పొందియుండును. ఇక సంస్కృతనిష్ఠమయిన హిందీగాని, పారసీశబ్ద బహుళమయిన ఉర్దూగాని చిన్న గట్టుమీద పుట్టిన కొండవాగులవలె ఇట్టె యెండిపోవును.

హిందువులని, ముసల్మానులని భేద మెంచుట భ్రాంతిమూలకము. అట్లే హిందీ, ఉర్దూభాషల సంగతికూడ. హిందువులు తమ భాషలోగల పారసీమాటలను, అట్లే ముసల్మానులు తమ భాషలోగల సంస్కృత శబ్దములను విడిచిపెట్ట నెంచుట అనవసరము. ఆ రెండు ధారల సంగమమును గంగా యమునా సంగమమువలె శ్రుతి మనోహరమయి, సుఖకరమయి యుండుటేగాక శాశ్వతముగా కూడ నుండ గలదు. హిందీ ఉర్దూ తగాదాలలో ప్రవేశించి మనము మనశక్తిని, యుక్తిని పోగొట్టుకొనకుందుము గాక. లిపిని గురించి చిక్కు ఉన్నమాట నిజమే. ఇప్పు డున్న స్థితిగతులలో ముసల్మానులు అరబ్బీ లిపిని, చాలమంది హిందువులు నాగరి

లిపిని అభిమానించెదరు. కనుక రెండు లిపులను ఆదరింపదగినవే. ఇదేమంత కష్టమైన పనికాదు. చివరకు సులభలిపి యేదియో అదియే నిలువగలదు. దేశము లోని అంతర్ప్రాంతీయ వ్యవహారములకు గాను ఒక సామాన్య భాష అవసరమే. దీనిలో సందేహమే లేదు.

గాంధీజీ పై విధముగా చేసిన ప్రతిపాదనను, పరిభాషను ఆనాడు హిందీ సాహిత్య సమ్మేళనమువారు అంగీకరించియే యుండిరి. హిందీ అనగానేమో, ఆ భాషను ఎందుకు అంగీకరింప వలెనో స్పష్టము చేయబడుటవలన అది అతిప్రధాన విషయమని గ్రహింపవలెను.

ఈనాటికింకను హిందీ భాషావిషయమయి సందేహములు ప్రబలియున్నవి గనుక హిందీని గుఱించిన పై స్పష్టీకరణ అత్యంత ప్రాముఖ్యము వహించియున్నది. మహాత్మాగాంధి 1918 లో చెప్పినట్లుగానే 1935 లో కూడ ఆ మాటలనే చెప్పి యున్నారు. 1945 లో "జాతీయభాషను గుఱించిన భావములు." అను పుస్తకమునకు పీఠిక వ్రాయుచు గాంధీజీ ఇట్లు వ్రాసియున్నారు.

"1947 లో మొట్టమొదటిసారి ఈ విషయమయి మాట్లాడియున్నాను. తరువాత అనేక పర్యాయములు మాట్లాడియున్నాను. నాటికిని నేటికిని నావి అవే అభిప్రాయ ములు. అయితే యిప్పుడవి చాల గట్టిపడి, శక్తిమంతములయి అతి స్పష్టముగా నున్నవి. ఉర్దూ హిందీ భాషల భేదము నా కెన్నడును కనబడనే కనబడదు. నేను హిందుస్తానీ అను మాటను సర్వత్ర ప్రచారము చేయుచున్నాను. 1918 లో ఇందూరులో జరిగిన హిందీ సాహిత్య సమ్మేళన సమావేశములో ఏమి చెప్పి యున్నానో, నేడును అదే చెప్పుచున్నాను. హిందుస్తానీ ఉర్దూభాష కాదు. హిందీ ఉర్దూ భాషల మనోహరమయిన కలయిక. ఆ భాషను నాగరి లిపిలోను, ఉర్దూ లిపిలోను గూడ వ్రాయవచ్చును. ఆ భాష ఒక్కటే పూర్ణమయిన జాతీయ భాష. మిగిలిన భాష లన్నియు అపూర్ణములే. ప్రస్తుతము జాతీయ భాషను, అపూర్ణముగా గాకుండ, పూర్ణముగా అభ్యసింపగోరువారు రెండు లిపులను నేర్చుకొనవలెను.

రెండు రూపములను తెలిసికొనవలెను. మనకు దేశ ప్రేమ యున్నయెడల ఈ కర్తవ్యమునుండి మనము తప్పించుకొనజాలము. ఆ విధముగా ఎవరు నేర్చు కొందురో వారు అదృష్టవంతులు. మిగిలిన వారు దురదృష్టవంతులు."

గాంధీజీ తమ జీవితాంతమువఱకును ఈ అభిప్రాయములనే కలిగియుండిరి. వారి ప్రార్థనానంతర ఉపన్యాసములను, వారి రచనలను చూచినయెడల ఆ సంగతి స్పష్టము కాగలదు.

హిందీ-హిందుస్తానీభాషకు రోమనులిపిని వాడుటనుగూర్చి ఇక్కడ రెండుమాటలు చెప్పుకొనుట మంచిది. ముసల్మానురాజుల పరిపాలనా కాలములో, ఆ రాజులును, అప్పటి సామంతులును ప్రజల భాష యయిన హిందీని వాడుక చేయునప్పుడు తాము నేర్చిన పారసీలిపిలో ఆ భాషను వ్రాయుచుండిరి. అట్లే బ్రిటిషు రాజుల కాలములో ఆ భాషను ఇంగ్లీషు లిపి అనగా రోమను లిపిలో వ్రాయుచుండిరి. ఛ, ఝ, ఠ, ఢ, భ మొదలయిన అక్షర ములకు సరియయిన అక్షరములు అరబ్బీ, పారసీ లిపులలో లేవు. అందువలన హిందీ భాషకుగాను ఉర్దూ లిపిలో ఆ అక్షరములను సృష్టిచేసి యున్నారు. ఆ విధముగానే రోమను లిపిలోగూడ ఆ అక్షరములకు కొన్నిగుర్తులు వ్రాయుట మొదలుపెట్టి యున్నారు. ఆ విధముగా ఈ ఉత్తర భారతీయ భాష నాగరి, ఉర్దూ, రోమను లిపులలో వాడబడుచుండెను. అందువలన ఈ భాషకు ఏ లిపి వాడవలెను, అన్నప్రశ్న బయలుదేరినది. ఈ ఉర్దూ, నాగరి లిపుల తగాదాను చంపివేయుటకు రోమనులిపి వాడుట మంచిదని కొందఱు వాదింపసాగిరి. కాని మనలో చాలమంది ఆ వాదమును అంగీకరింపలేదు. గాంధీజీకి ఆ వాదము మొదలే గిట్టదు. మన

భాష లన్నిటికిని-నాగరి లిపి సర్వశ్రేష్ఠ మయినదనియు, ప్రజలు వాడుక చేయుచున్నారు గనుక ఉర్దూలిపిని సైతము ఉపయోగింప వచ్చుననియు వారు చెప్పుచుండిరి. రోమను లిపిని పటాలము లోను, ఉద్యోగస్థులును ప్రధానముగా వాడుచుండిరి. అంతేకాని ప్రజలలో అది వ్యాపించి యుండలేదు.

ఇక్కడ మఱియొక్క సంగతిని గుర్తుంచుకొనవలెను. మన రాజ్యాంగచట్టములో ఇంగ్లీషు అంకెలు అంగీకరింపబడినవి. కారణ మేమనగా అవి దక్షిణాది భాషలలోను, కొంతవఱకు ఉర్దూలోను వాడుకలో నున్నవి. రాజ్యాంగ నిర్మాతలు హిందీ స్వరూపమును గుఱించి ఉదారముగ వ్యవహరించుట వల్లనే పైవిధముగా అంగీకరించి యున్నారు. (351 సూత్రము చూడుడు) హిందీ సాహిత్య సమ్మేళనమువారును; మొత్తముమీద ఉత్తర భారతీయులును పై మార్పును అంగీకరింపలేదు. ఇందు ఆశ్చర్య మేమియు లేదు. 1950 సంవత్సరమునకు పూర్వము అనగా స్వరాజ్యము రాకమునుపు కూడ వారీ విధముగానే ఉర్దూను తిరస్కరించి యున్నారు. వారి సంకుచిత జాతీయ దృష్టియే దానికి ప్రధాన కారణము. స్వరాజ్యము వచ్చిన తరువాత, హిందువుల ప్రాధాన్యమునుకూడ తిరుగదోడవలెనని వారెంచుచుండిరి. నాగరి లిపియే కావలెనని వాదించువారి విషయమయి గాంధీజీ 25-1-48న ఇట్లు సెలవిచ్చియున్నారు.

"నాగరి లిపివాదులు ఉర్దూలిపి పనికిరాదని వాదించుట చూడగా వారి ద్వేష భావము, అసహనము వెల్లడి యగుచున్నవి."

ఇంగ్లీషు అంకెలు పనికిరావని వాదించువారి విషయములో గూడ ఈ యంశములే స్పష్టపడుచున్నవి.

4. మొదటి దశ

మనము పైన చూచినట్లు ఈ ఉద్యమముయొక్క మొదటి దశ 1918 లో ప్రారంభమయినది. గాంధీజీ దూరదృష్టి గలవారును, ప్రాజ్ఞులును గనుక, దక్షిణభారతములోని ద్రావిడభాషలవారు హిందీ నంగీకరించుట అవసరమని గుర్తించిరి. వారీక్రొత్త భాషను నేర్చుకొనదగు అవకాశములుకూడ ఉండవలెనని తెలిసికొనిరి. అందువలన 1918 లో, దక్షిణ భారతములోని నాలుగు భాషలవారిలోను హిందీ వ్యాప్తి చేయుటకుగాను, మదరాసులో దక్షిణభారత హిందీ ప్రచారసభ స్థాపింపబడెను.

1919-20 సంవత్సరములో గాంధీజీ 'నవజీవను' 'యంగిండియా' అను వారపత్రికలను, అహమ్మదాబాదులో గుజరాతు విద్యాపీఠమును నెలకొల్పిరి. జాతీయ విద్యను, జాతీయ భాషను ప్రచారము చేయుటయే పైసంస్థల ఉద్దేశము. ఈ రెండు లక్ష్యములను గుజరాతు విద్యాపీఠమువారి నిబంధనావళిలో చేర్చియున్నారు.

1. విద్యాపీఠము పాఠ్యక్రమములో హిందీ— హిందుస్తానీ బోధ నిర్బంధమయియుండును.

షరా : ఉత్తర భారతములోని హిందువులు, ముసల్మానులు సమానముగా వాడునట్టి, నాగరిలో గాని పారసీలిపిలోగాని వ్రాయబడునట్టి భాషకే హిందీ— హిందూస్తానీ అని పేరు.

2. ప్రాంతములోని భాష అనగా "స్వభాష" విద్యాపీఠములో ప్రధానస్థానమలంకరించియుండును. విద్యాబోధకంతకును ఆ భాషయే మాధ్యమముగానుండును.

హిందీ ఉద్యమమునకు సంబంధించినదే మరియొక ప్రధాన విషయమును గుజరాతు విద్యాపీఠమువారు ప్రసంగించియున్నారు. అది బోధనా మాధ్యమమును గురించినది. బ్రిటిషురాజుల కాలములో బోధనావిషయము లన్నిటిలోను, పరిపాలనా శాఖల లోను, ఇంగ్లీషుభాష "మాధ్యమము"గా నుపయోగించుచుండిరి. ఆ భాషను తెలిసినవారు నూటికి ఒక్కరే ఉన్నప్పటికిని, అభాషయే మన ప్రజాజీవితములో "మాధ్యమము"గా నేర్పడియుండెను. హిందీ ఉద్యమ వ్యాపకులు ఈ చిక్కునెట్లు విడదీయగలరు అను ప్రశ్న వచ్చినది. గాంధీజీ ఈ విషయములో తమ విస్పష్టమయిన అభిప్రాయమును చెప్పియుండిరి. ఉన్నత విద్యా తరగతులలో హిందీ బోధనా మాధ్యమముగా నుండుటకు మహాత్మాగాంధి అంగీకరించినారా యని కొందఱడుగుచుందురు. జాతీయ విద్యా ప్రచారము చేయు సందర్భమున ఈ విషయము చెప్పబడినది. "పాఠశాలలలో గాని, కళాశాలలలో గాని బోధనా మాధ్యమము స్వభాషగానే ఉండవలెను. హిందీ-హిందుస్తానీ బోధ నిర్బంధ ముగా నుండవలెను." ఇవి వారి అభిప్రాయములు.

ఆ విషయమును విపులీకరించుటకు గాను, 25-1-48 న గాంధీజీ ఢిల్లీలో తమ ప్రార్థనానంతర ఉపన్యాసములో ఇట్లు సెలవిచ్చిరి:

"ప్రాంతీయ భాషలు పూర్ణవికాసము పొందవలెనన్న భాషాధారక రాష్ట్రముల క్రింద రాష్ట్ర పునర్విభజన జరుగుట అవసరము. హిందుస్తానీ భారతదేశమున కంతకు రాష్ట్ర (జాతీయ) భాషగా నుండగలదు. అంతేకాని అది ప్రాంతీయ భాషల స్థానమును అతిక్రమింపరాదు. ప్రాంతములలో అది బోధనామాధ్యమముగా ఉండ రాదు. ఆ విధముగా ఇంగ్లీషు ఉండకూడదని వేఱుగా చెప్పనక్కఱలేదు. హిందీ

వల్ల భారత జాతీయత స్పష్టము కావలెను. మనము గుజరాతీయులమయినను, మహారాష్ట్రులమయినను, అరవలమయినను, లోకము మనలను గుర్తింపజాలదు. భారతీయులన్నయెడలనే గుర్తింపగలదు. కనుక మనము విభేదభావములను విడిచిపెట్టి భారతీయులమను భావముతో ఉదాత్తముగా వ్యవహరింపవలెను. ఈ పద్ధతిని మనస్సులో పెట్టుకొనియే భాషా రాష్ట్రముల నిర్మాణము జరుగవలెను. తద్ద్వారా విద్య, వాణిజ్యము వృద్ధిపొందవలెను."

డాక్టరు ఎం. ఎస్. పటేలు పైన ఉదాహరించిన పుస్తకములలో బోధనా మాధ్యమమును గుఱించిన గాంధీజీ అభిప్రాయములను ఈ క్రిందివిధముగా తెలియఁజేసియున్నారు:

"ఎంత కష్టము వచ్చినను, ఎంత నష్టము వచ్చినను సరే, బోధనామాధ్యమము వెంటనే మార్పుచెందవలెననియు, ప్రాంతీయ భాషలకు సముచితస్థానమియ్యవలెననియు గాంధీజీ కోరుచుండిరి. పరభాషామాధ్యమము మూలమున ఎంతో శక్తి క్షీణించిపోవుచున్నది. అందువలన ఉన్నతవిద్యలో స్వభాషను బోధనా భాషగ క్రొత్తగ ప్రవేశపెట్టినందువలన కొన్ని ఒడుదుడుకులు రాగలవనుకొనుడు. అయినను సంతోషమే యని గాంధీజీ అభిప్రాయము. హైస్కూలు, కాలేజీ మొదలయిన తరగతు లన్నిటిలోను బాలకుని మాతృభాషయే బోధనామాధ్యమముగా నుండవలెనని వారు నిశ్చయబుద్ధితోచెప్పుచున్నారు. పండిత జవాహరులాలునెహ్రూ భావములుకూడ ఇంతే. యావద్భారతదేశములోనున్న ఉన్నత విద్యలో బోధనా మాధ్యమముగా ఇంగ్లీషునకు బదులు హిందీని ప్రవేశపెట్టుట ఇద్దరకును ఇష్టములేదు.

అహిందీ ప్రాంతీయులకు హిందీ క్రొత్తభాష. అందువలన మనోవిజ్ఞానమును బట్టి చూచినను, విద్యాపద్ధతినిబట్టి చూచినను, ఆ భాషను బోధనా మాధ్యమముగా చేయుట తప్పు. బాలకుడు సర్వవిషయములను తన మాతృభాషలో సులభముగా గ్రహింపగలుగుటయేగాక వానిని అవలీలగా వ్యక్తము చేయగలడుకూడ.

ఇంగ్లీషు మన జాతీయభాషగా ఉండుటకు పనికిరాదనియు, అది బోధనా మాధ్యమముగా కూడ ఉండరాదనియు, గాంధీజీ నమ్ముచుండిరి. ఇంగ్లీషు గొప్ప భాష అనియు, దాని సాహిత్యము మహత్తరమయినదనియు విశ్వసించెదరు. కాని మన దేశములోని భాషాపండితులు మాత్రమే దాని నభ్యసింపవలెనని వారుకోరుచుండురు.

అంతర్జాతీయ వ్యాపారమునకు గాను, అది ప్రపంచ భాషగా ఉపయోగపడ గలదని వారి యభిప్రాయము. హిందూస్తానీని దేవనాగరిలో వ్రాయండి, లేదా ఉర్దూలో వ్రాయండి, అదే భారతదేశమునకు జాతీయభాష కాదగినదని వారి స్పష్టమయిన అభిప్రాయము. స్కూలు పాఠ్యక్రమములో అది నిర్బంధ పఠనీయ విషయముగా నుండవలెను. అహిందీ ప్రాంతములలో హైస్కూలు, కాలేజీ తరగతులలో ఆయా ప్రాంతీయ భాషలు బోధనామాధ్యమములుగా నుండును గనుక అక్కడ హిందీని మాధ్యమముగా ప్రవేశపెట్టరాదు."

ఈ విధముగా హిందీ, అంతర్రాష్ట్రాంతీయ వ్యవహారము లకును, యావద్భారత వ్యవహారములకును ఉపయోగపడవలెనని గాంధీజీ అభిప్రాయము. అందువలన అహిందీ ప్రాంతములలో అది బోధనామాధ్యమముగా నుండుటకు వీలులేదు. ఈ పద్ధతిని చాలవఱకు ఇండియా గవర్నమెంటువారును, అహిందీ ప్రాంత ములలోని యూనివర్సిటీలవారును అంగీకరించియున్నారు.

ఈ సందర్భములో హిందీ సాహిత్య సమ్మేళనమువంటి హిందీ సంస్థల వాదమేమో తెలిసికొనవలసి యున్నది. హిందీ నిర్వచనము తగాదాకు కారణ మయినట్లువలె హిందీ ఏ యే రంగములలో ఉపయోగపడవలెనో ఆ విషయములో కూడ తగా దాలు కలిగినవి. 1947 లో మనము స్వతంత్రుల మయిన నాటి నుండియు ఈ విభేదములు మఱికొంత ఎక్కువయినవి. ఇప్పుడు బోధనామాధ్యమము గాను, ఉద్యోగవ్యవహార భాషగాను ఇంగ్లీషు ఉపయోగింపబడుచున్నది. ఇకముందు ఆ స్థానమును హిందీ ఆక్రమింపవలెనా లేక ఆయా ప్రాంతీయ భాషలు ఆక్రమించునా? ఏనాడో 1917 లో గాంధీజీ, భరోచి గ్రామములో జరిగిన గుజరాతీ విద్యామహాసభలో ఈ విషయమయి స్పష్టము చేయుచు విద్యా

తరగతు లన్నిటిలోను మాతృభాషయే బోధనా మాధ్యమముగా నుండవలెనని ముక్తకంఠమున చెప్పియున్నారు. గడచిన ఏబది సంవత్సరములలోను, నూతనజీవము పోసికొనుచున్న భారతీయులు ఆ భావమును ఏకగ్రీవముగా నంగీకరించి యున్నారు. హిందీ ప్రచారోద్యమ వ్యాపకులు ఈ విషయము ప్రధానాంశమని గుర్తించి యున్నారు. అయితే ఇప్పుడిప్పుడు హిందీసాహిత్య సమ్మేళనము వారును, వారి శాఖయయిన వర్ధాసమితివారును, దేశమం దంతట గల ఉన్నత విద్యలో హిందీ ఒక్కటియే బోధనామాధ్యమముగా నుండవలెనని చెప్పుచున్నారు. ఈ వాదము వింత అయినదే. గాంధీజీ హిందీ ప్రచారోద్యమ ప్రారంభము నుండియు చేయు చున్న బోధకును, దీనికిని తేడా కనబడక మానదు. ఆ విధముగా హిందీని ఉపయోగించుకొన్న యెడల దానికిని, ప్రాంతీయ భాషల కును విరోధ మేర్పడును. ఆ యా ప్రాంతములలో ప్రాంతీయ భాషలు "మాధ్యమములు"గా నుండవలెననియు, హిందీ యావ ద్భారత దేశభాషగా నుపయోగపడవలెననియు ఆ యా ప్రాంతీయులు కోరుచుందురు. ఈ విషయమును కొంత విపులముగా ఇకముందు చర్చింపగలము.

## 5. నిర్మాణ కార్యక్రమము - హిందీ

1924-25 సంవత్సరములలో గాంధీజీ నిర్మాణ కార్యక్ర మమును సిద్ధపఱచి కాంగ్రెసుచే అంగీకరింపజేసి యున్నారు. ఆ కార్యక్రమములో హిందీ ప్రచారముకూడ ఒకటి. ఇండియను నేషనల్ కాంగ్రెసునకు వ్యవహారభాష హిందీయని కూడ

కాంగ్రెసుచే ఆమోదింప జేసియున్నారు. 1924 లో బెల్గాములో జరిగిన కాంగ్రెసు మహాసభకు గాంధీజీ అధ్యక్షులు. వారు తమ అధ్యక్షోపన్యాసములో ఇటు చెప్పిరి:

ప్రాంతీయప్రభుత్వ వ్యవహారములలో శాసనసభలలో, న్యాయస్థానములలో, ఒక నిర్ణీతకాలములోపల, ఆ ప్రాంతీయ భాషయే అధికారభాషగా నుండవలెను. సుప్రీము కోర్టులో హిందుస్తానీ ఉండవలెను. దానికి దేవనాగరి లిపి యయినను, లేదా పారసీ లిపి యయినను వాడవచ్చును. కేంద్ర ప్రభుత్వములోను, కేంద్ర శాసన సభలలోను కూడ హిందుస్తానీయే అధికార భాషగా నుండవలెను. అంతర్జాతీయ వ్యవహారములలో ఇంగ్లీషు ఉపయోగింపబడగలదు. స్వరాజ్యమునకు కావలసిన అంశములలో ఈ భాష విషయము ఒకటి గనుక, నేను దీనిని మీకు వినిపించినాను. ఇదివిని, "ఇదేమి చాదస్తమయ్యా" అని మీరనుకొనవచ్చును. నేను కోరిన విధముగా జరుగుటకు మన కధికారము లేదని తెలియును. అయినను మనకటువంటి నిశ్చయబుద్ధి అయినను కలదాయని అడుగుచున్నాను. అట్టి సంకల్పమయినను కలుగుటకు కృషి చేయుదుముగాక." (యంగిండియా 26-12-24)

మఱుసంవత్సరము 1925 లో ఇండియను నేషనల్ కాంగ్రెసు కాన్పూరులో జరిగినప్పుడు అందు, ఈ క్రింది తీర్మానము ప్రకారము కాంగ్రెసు నిబంధనావళి సవరణ చేయబడినది :

"కాంగ్రెసు నిబంధనావళిలోని 23 వ సూత్రము ఈ దిగువ విధముగా సవరింపబడవలెను :

కాంగ్రెసు వ్యవహారములను వీలయినంతవరకు, హిందుస్తానీలో జరుపవలెను. ఉపన్యాసకునకు హిందుస్తానీ రానియెడలను, అవసరమయినప్పుడును, ఆతడు ఇంగ్లీషులో గాని, ప్రాంతీయభాషలో గాని మాట్లాడవచ్చును. ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ వ్యవహారములు సామాన్యముగా ఆ ప్రాంతీయ భాషలోనే జరుగవలెను. అందుకు హిందూస్తానీనికూడ వాడుకచేయవచ్చును."

గాంధీజీ ఈ విషయమయి వ్యాఖ్య చేయుచు యంగిండియా నవజీవన్ పత్రికలలో ఇట్లు వ్రాసియున్నారు :

"హిందూస్థానీని గురించిన తీర్మానము ప్రజాభిప్రాయమునకు చాల అనుకూలముగా నున్నది. మన వ్యవహారములు ఇంకను ఇంగ్లీషులోనే నడపబడుచుండుట వలన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యులకును, ప్రతినిధులకును ఘోరాపచారము జరుగుచున్నది. దీనిలో సంశయములేదు. ఒకానొకనాడు మనము తుది నిర్ణయము చేయక తప్పదుగదా. మనమట్లు చేసిననాడు కొందరకు ఇబ్బంది, కొందఱకు కడుపుమంట ఉండకమానదు. మన మెంత శీఘ్రముగా హిదుస్థానీలో వ్యవహారములు మొదలుపెట్టిన దేశాభ్యుదయమున కంత మంచిది.

(యంగిండియా 7-1-26)

కాంగ్రెసువ్యవహారములు వీలయినంతవరకు హిదుస్థానీలో జరిపింపవలెనన్న తీర్మానము చాల ప్రధానమయినది. కాంగ్రెసు సభ్యులు అందరు దానినంగీకరించి ఆ ప్రకారము నడచుకొన్నయెడల, భారత దేశములోని బీద ప్రజలకు కాంగ్రెసు వ్యవహారములం దాసక్తి కలుగగలదు. (నవజీవన్ 3-1-26)

భారతజాతి ప్రజలు నిర్మాణ కార్యక్రమము విషయములో విశేషశ్రద్ధ చూపదగుదురని 1941 లో తెలియజేయబడెను. ఆ సందర్భమున నిర్మాణ కార్యక్రమము అనుపేర గాంధీజీ ఒక కరపత్రమును ఇట్లు ప్రకటించియున్నారు. నిర్మాణ కార్యక్రమ మనగా, సత్యాహింసల ద్వారా పూర్ణస్వరాజ్య నిర్మాణమని చెప్పవచ్చును, గాంధీజీ ఆ కార్యక్రమములో హిందీ ప్రచారమును, స్వభాషా ప్రేమనుకూడ రెండు అంశములుగా చేర్చియున్నారు. ఈ రెండిటిని గుఱించి వారు చెప్పిన అభిప్రాయములు తెలిసికొన్న యెడల క్లుప్తముగా ఈ ఉద్యమాశయమేమో తెలియగలదు. ఇది చాల ముఖ్యమయినది గనుక ఒకటవ అనుబంధములో దీనిని పొందుపఱచుచున్నాను.

## 6. హిందీ, ఇతర భారతీయ భాషలు

గాంధీజీ 'హిందీ' తో పాటు 'హిందుస్తానీ' అను మాటను గూడ ఉపయోగించినారని గుర్తుంచుకొనవలెను. గుజరాతు విద్యా పీఠము నిబంధనావళిలో వారు హిందీ - హిందుస్తానీ అనికూడ వాడియున్నారు. హిందీ అనగా ఉర్దూకంటె భిన్నమయినదని ఎవరయినను తలచినయెడల, అట్లు కాదుసుమా అని చెప్పుట కొఱకే వారు పైవిధముగా ఉపయోగించియున్నారు. హిందీ ఉద్యమములోని ప్రధానాంశమే యిది, దేశభాషగా ఉపయోగపడు హిందీ అన్నిటిని సమన్వయించుకొను భాషగా అనగా మిశ్రిత భాషగా నుండవలెను. అది అన్నిజాతులవారికి, అన్ని మతముల వారికి అందుబాటులో ఉండవలెను. ఈ విషయము మన రాజ్యాంగ శాసనములో లెస్సగా పొందుపఱుపబడినదని చెప్పవచ్చును (351 సూత్రము చూడుడు). మతములు, జాతులసంగతే కాకుండ సమస్తభాషల సమన్వయము కూడ అందు పేర్కొనబడినది. హిందీభాష, భారతీయ సమగ్ర సంస్కృతిని వ్యక్తముచేయు భాషగా నుండగలదని మన రాజ్యాంగ శాసనము చెప్పుచున్నది (351 సూ). ఈ విధముగా హిందీభాష భారతజాతిని యావత్తు ఒక్కసూత్రముతో బంధించి ఐకమత్యమును పెంపొందించుటకు సాధనముగా ఏర్పఱుపబడినది. ఐకమత్యమనగా పైకి ఒక్క రూపముగా నున్నట్లు కనబడుటకాదు. మన భాషలలో, మతము లలో ఉపజాతులలో భిన్నత్వము ఉన్నప్పటికిని ఆ భిన్నత్వములో ఏకత్వసాధన చేయుటయే ఐకమత్యము. హిందీ ప్రచారోద్యమము లోని మొట్టమొదటి ప్రధానాంశమిదియే.

మఱియొక ప్రధానాంశ మున్నది. హిందీభాష, ప్రాంతీయ భాషలతో పోటీ చేయరాదు. వానిని అణగద్రొక్కరాదు. వాని స్థానములో ప్రవేశింపరాదు. పైగా హిందీ భాషవల్ల ఆయా స్వభాష లకు ప్రోత్సాహము, అభివృద్ధి గలుగవలెను. ఆ భాష, కేవలము అంతర్ప్రాంతీయ వ్యవహారములకును, కేంద్ర వ్యవహారములకును మాత్రమే ఉపయోగపడవలెను. ఈ విధముగా మనము అహిందీ ప్రాంతీయులకు నచ్చజెప్పియున్నాము. సమస్త విషయముల సమన్వయభాషగా ఏర్పడినప్పుడే హిందీభాషకు అఖిల భారతీయ భాషాగౌరవము ఏర్పడగలదు. ఆనాడే దానికి అందఱును పట్టము కట్టగలరు. ఈ అంశముకూడ మొదటి అంశములోని భాగమే.

ఇక రెండవ అంశముకూడ పైదానివలెనే ప్రధానమయినది. హిందీభాషతోపాటు ప్రాంతీయ భాషలుకూడ తుల్యగౌరవముతో అభివృద్ధి పొందినగాని హిందీ ప్రచారోద్యమము సఫలీకృతము కాజాలదు. కాబట్టి గాంధీజీయును ఇంకను ఇతరులును ఈ విషయ మయి పదేపదే చెప్పుచునేయున్నారు. ఈ విషయమయి మన రాష్ట్రపతి రాజేంద్రబాబు, 1953 ఫిబ్రవరి 22 వ తేదీన దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మదరాసులో మాట్లాడుచు ఇట్లు చెప్పియున్నారు :

"భారతదేశమునకు "హిందీ" జాతీయ భాషయని మన రాజ్యాంగ శాసనము చెప్పుచున్నది. ప్రాంతీయ భాషలకును, హిందీకిని పోటీ ఎన్నడునులేదు. ఉన్న పోటీ ఇంగ్లీషుతో మాత్రమే కలదు. హిందీ సులభ భాషయను ఉద్దేశముతో దానిని జాతీయ భాషగా వరించుట జరిగినది. హిందీ భాష, ప్రాంతీయ భాషల స్థానము నాక్రమింపవలెనని రాజ్యాంగ శాసనకర్తల యభిప్రాయము కానేకాదు.

జనులు ఇంగ్లీషు విషయమయి శ్రద్ధను విడిచిపెట్టి హిందీ విషయమయి శ్రద్ధచూప వగుదురు—"

ఈ ప్రధానాంశమును మనస్సులో పెట్టుకొనియే దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు ముందడుగు వేసికొనుచు పోవు చున్నారు. శ్రీ రాజాజీ, శ్రీ సి. పి. రామస్వామిఅయ్యరు మున్నగు ధీమంతులు ఇట్టి సదాశయములతోనే పై సభవారికి, నేటికిని చేదోడువాదోడుగా నుండుచున్నారు. స్వరాజ్యానంతరము దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు విస్పష్టముగా ఈ క్రింది రెండు విషయములను ఉద్ఘాటించియున్నారు :

1. హిందీ పరీక్షలలో కూర్చుండు ప్రతి విద్యార్థియు దక్షిణాది భాషలలో నేదో నొక భాషలో పరీక్షాపత్రమునకు జవాబు వ్రాయవలెను.
2. భారత జాతీయభాష యగు హిందీని వృద్ధిచేయుటలో అహిందీ ప్రాంతీయు లందఱకును న్యాయసమ్మతమగు హక్కు గలదు.

స్వరాజ్యానంతరము నడపబడుచున్న ఈ ఉద్యమమునకు ఈ రెండును మిక్కిలి ప్రధాన విషయములు. ఇవి ఉద్యమము రెండవ దశలో ఇంకను ప్రాధాన్యము వహించి యున్నవి. వీనిని గుఱించి మరల చర్చించెదను. రెండవ దశ 1935 నుండి ప్రారంభము కాగలదు.

ఈ రెండవ అంశమును మన రాజ్యాంగశాసనములో కూడ అంగీకరించి యున్నారు. అహిందీ ప్రాంతీయుల సందేహములను తొలగించుటకు దానిలో ఇంకను కొన్ని వివరము లుండిన బాగుండెడిది. ప్రాంతీయ భాషలతోపాటు, హిందీకూడ ప్రాంతీయ

భాషగా నుండవచ్చునని రాజ్యాంగము చెప్పుచున్నది. అందువల్ల కొందఱకు సందేహములు గలుగుచున్నవి. బోధనామాధ్యమమును గుఱించి రాజ్యాంగములో వివరములు లేవు. బోధనామాధ్యమముగా ప్రాంతీయభాషకు బదులు హిందీ ఎందుకు ఉండకూడదు అని కొందఱకు అనుమానము గలదు. హిందీని ఒక ప్రాంతీయ భాషగా అంగీకరించినను దానివలన మిగిలిన ప్రాంతీయ భాషలకు అపకారము జరుగదని రాజ్యాంగములో స్పష్టమయిన నిర్దేశము ఉండవలెను. అట్లు చేయనియెడల, యావద్భారత దేశభాషగాను, అంతర్ప్రాంతీయ భాషగాను హిందీని అంగీకరించుటకు జనులు వెనుకముందులు చూచెదరు. పైగా కొందఱు వ్యతిరేకించెదరు కూడ. ఇంగ్లీషు స్థానమును హిందీ ఆక్రమించుటకు కొంత ఆలస్యము జరుగగలదు. దాని పర్యవసాన మేమనగా దక్షిణాదిలో వలె జనులు హిందీకి బదులుగా ఇంగ్లీషునే కావలె ననుచుందురు. ఈ లక్షణములు మనదేశములోని తూర్పుభాగములో కూడ కనబడు చున్నవి.

## 7. రెండవ దశ

మొదటి దశ 1918 మొదలు 1935 వరకు నడచెనని నేను లోగడ చెప్పియుంటిని. ద్రావిడభాషలు మాట్లాడువారు హిందీని సులభముగా నేర్చుకొనగలరని ఈ మధ్యకాలములో తెలియ వచ్చినది. అందువలన హిందీ ప్రచారమునకు గలుగు మొదటి ఆటంకము తొలగిపోయినది. ప్రచారోద్యమములోని రెండవదశలో మఱియొక ఆటంకము గలిగినది. దానిని వివరించెదను.

1935 లో ఇందూరులో రెండవసారి, హిందీ సాహిత్య సమ్మేళన సమావేశము జరిగినది. గాంధీజీ మరల అధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. 18 సంవత్సరముల క్రిందట హిందీని గురించి గాంధీజీ చేసిన నిర్వచనమునే, మరల వారు చేసియుండిరి. హిందీ సాహిత్య సమ్మేళనమువారు కూడ దాని నామోదించియుండిరి. కాని కొలదిరోజులకే వ్యతిరేకత బయలుదేరినది. హిందీ సాహిత్య సమ్మేళనమునకు నాయకులు శ్రీ పురుషోత్తమదాసు టండనుజీ, హిందీ ప్రచారోద్యమ స్థాపకులు శ్రీ గాంధీజీ, వారికిని వీరికిని విభేదములు పొడసూపినవి.

ఈ విషయమయి గాంధీజీ 25-1-48 హరిజనసేవక్ పత్రికలో ఇట్లు వ్రాసియున్నారు.

"హిందీ సాహిత్య సమ్మేళనములో నేను హిందీ పరిభాషను విప్పిచెప్పినపుడు, దానినెవరును వ్యతిరేకించలేదు. కాని తరువాత ఈ వ్యతిరేకత ఎందువలన కలిగినదో, దానిని తలచుకొన్నయెడల విచారము కలుగగలదు. ఆ వృత్తాంతమును నేను జ్ఞాపకము కూడ ఉంచుకొనదలంచుటలేదు.

హిందీ సాహిత్య సమ్మేళనము అన్న పేరు కూడ బాగుండలేదనియు, ఆ సంస్థ జాతీయభాషాప్రచారము చేయుచుండుటలేదనియు కూడ చెప్పితిని. కేవలము సాహిత్య ప్రచారము చేయుటకు నేను అధ్యక్షపదవిని గ్రహించియుండలేదు. పేరులో ఏమున్నదనియు, సాహిత్యముకంటె జాతీయభాషాప్రచారము చేయుటయే మన కర్తవ్యమనియు కి. శే. జమ్నాలాలు, మున్నగు మిత్రులు నాతో చెప్పియున్నారు. అందువల్లనే నేను దక్షిణభారతమున ఈ భాషా విషయమయి తీవ్ర ప్రచారము చేసియున్నాను.

నేటికి నా ఉపవాసము ప్రారంభించి ఆఱు దినములయినది. ఈ ఉదయము, ప్రార్థనానంతరమున నేను ప్రక్కమీదకూరుచుండి ఈ పంక్తులు వ్రాయుచున్నాను. ఎన్నో విచారకరమగు ఘట్టములు నా మనస్సునకు తగులుచున్నవి. నేను వానిని పెంచదలచుకొనలేదు.

నాకు పేరును గుఱించి కూడ తగాదా పడవలెనను ఉద్దేశము లేదు. పేరు ఏదయిన నేమి? మనకు కావలసినది పని. యావద్భారతక్షేమమే మన ప్రధాన లక్ష్యము. పేరును గుఱించి ఎటువంటి ద్వేషభావము పనికిరాదు.

"సారే జహాఁసే అచ్ఛా హిందుస్తాఁ హమారా" అని మహాకవి ఇక్బల్ తమ ప్రసిద్ధ గీతమును గానముచేసియున్నారు. ఆ గీతమును విని శరీరము పులకింపని భారతీయు లెవరైన నుందురా! ఎవరయినను అట్లున్నయెడల వారిని నిర్భాగ్యులని అందును. ఆ గీతములోని భాషను హిందీ అనవలెనా, హిందుస్తానీ లేక ఉర్దూ అనవలెనా? అది జాతీయభాషకాదని అనుటకు ఎవరికయినను సాహస మున్నదా? అందు మాధుర్యములేదా? ఉదాత్త భావసౌందర్యము తొణికిసలాడు చుండుటలేదా? ఈ రోజున నేను ఒంటరివాడనే కావచ్చును. కాని చిట్టచివరకు గెలు పొందునది సంస్కృత నిష్ఠమగు హిందీయు కాదు, పారసీ శబ్ద బహుళమగు ఉర్దూయు కాదు. హిందుస్తానీ మాత్రమే గెలుపొందితీరును. మన మనస్సులలో అన్యోన్యము భేదభావములు గలవు. అవి తొలగిపోయిననాడు, మనకు గల అస్వా భావికములగు ఈ తగాదాలు తమంతనే నశించిపోవును. ఆనాడు, గడచినదానికి మనము తలవంచుకొనవలసివచ్చును."

హిందీ ప్రచారాభివృద్ధికి గాను మహాత్మాగాంధీజీ ఈ సమా వేశములో మఱియొక గొప్ప పనిని తలపెట్టినారు. మదరాసులోని దక్షిణభారత హిందీ ప్రచారసభవంటి స్వతంత్ర సంస్థను, తూర్పు, పశ్చిమ భారతములలో పనిచేయుటకు స్థాపింపవలసినదని హిందీ సాహిత్యసమ్మేళనమువారిని కోరియున్నారు. మదరాసు సభవారి కార్యములను కొనసాగించుటకుగాను, సుమారొక లక్షరూపాయ లను కూడ వసూలు చేసియున్నారు.

వర్ధా సమితి :

నూతనసంస్థ ఏర్పఱుపబడిది. దానితో హిందీసాహిత్య సమ్మేళనమువారికిని, గాంధీజీకిని భేదభావములు ఏర్పడినవి. తూర్పు, పశ్చిమ భారతములలో హిందీప్రచారము చేయుటకుగాను

ఒక స్వతంత్రసంస్థను స్థాపింపవలసినదని గాంధీజీ కోరియున్నారు. అట్లు చేసినయెడల అది స్వతంత్రముగా పనిచేయుటకు వీలుండు ననియు, హిందీ సాహిత్య సమ్మేళనముతో ముడిపడి యున్న యెడల అందు గలుగుచున్న, కలుగబోయెడి మార్పులవల్ల నూతనసంస్థ నడక మందగించుననియు గాంధీజీ అభిప్రాయము. ఆ సంస్థ స్వతంత్రముగా పనిచేయుటకు హిందీ సాహిత్యసమ్మేళ నమువా రంగీకరింపక ఒక సమితిని స్థాపించియున్నారు. ఆ సమితి సమ్మేళనము వారి చెప్పుచేతలలోనే పనిచేయవలెను. ఆ సమితి పేరు "వర్ధాసమితి." ఈ విధముగా సమితి పనిచేయుచున్నను, హిందీ ప్రచారమునకు లోటు రాబోదని, సమ్మేళనమువారు గాంధీజీతో చెప్పియుండిరి. అందువలన గాంధీజీ నూతన సంస్థను దీవించి తాముకూడ ఆ సంస్థద్వారా పనిచేయసాగిరి. కాకాసాహెబు కలేల్కరు ఆ సమితికి ప్రధాన సంచాలకులుగా నుండిరి. గాంధీజీ తమ నివాసము వర్ధాలో ఏర్పఱచు కొన్నందువలన ఆ సమితి కార్యాలయము వర్ధాలో ఏర్పఱుపబడినది.

ఈ రోజులలో రాజకీయములలో చాల మార్పులు వచ్చినవి. 1935 రాజ్యాంగ శాసనము ప్రకారము రాష్ట్రములలో స్వపరిపాలన ఏర్పాటు చేయబడినది. పెక్కు ప్రాంతములలో కాంగ్రెసు మంత్రి వర్గములు పనిచేయుచుండెను. అందువలన నిర్మాణ కార్యక్రమము నకును, అందును హిందీ ప్రచారమునకును గొప్ప అండ దొరకినది. కొన్నిచోట్ల, పాఠశాలలలో హిందీ ప్రవేశపెట్టబడినది. *

* మదరాసులో శ్రీ రాజాజీ పాఠశాలలలో హిందీని ప్రవేశపెట్టియున్నారు. కొందఱు వద్ధతిని తీవ్రముగా ప్రతిఘటించియున్నారు. పూర్వమంత గాకపోయినను, అంతో, ఇంతో ఈ నాటికిని వ్యతిరేకత లేకపోలేదు.

బొంబాయిలో శ్రీ బాలగంగాధరఖేర్ ప్రధానమంత్రులుగా నుండిరి. వారి నాయకత్వమున హిందీ హిందుస్తానీ ప్రచారమునకు మంచి చేయూత లభించినది. పశ్చిమభారతములోనే ప్రచారకార్యము చురుకుగా జరుపబడెను. అప్పుడు, హిందీ స్వరూపమును, వ్యవహారమును గురించిన భేదములు స్పష్టముగా వెల్లడియయ్యెను. అందువలన 1942 లో గాంధీజీ హిందీ సాహిత్య సమ్మేళనము వారితో తమకుగల సంబంధమును వదలుకొనిరి. 1935 మొదలు 1945 వరకు ఈ భేదభావములు ప్రబలియున్న దినములు. కాన వానినిగూర్చి చర్చింపదలచుకొనలేదు. అయినను, స్వరాజ్యము తరువాతకూడ వెనుకటి సమస్యలు పరిష్కారము కాకపోవుటవల్ల వానిని తెలిసికొనవలసిన అవసర మేర్పడుచున్నది.

*హిందీ ప్రచారమునకు గవర్నమెంటుశాఖ :*

1935 నుండి హిందీప్రచార కార్యములు, రెండుమార్గము లలో జరుపబడుచుండెను. ఇప్పుడు గవర్నమెంటువారు కూడ హిందీ ప్రచారమునకు పూనుకొనిరి. దానివలన విశేషఫలితములు కలుగసాగినవి.

1935 లో అహమదాబాదులోని గుజరాతు విద్యాపీఠము వారు ఒక హిందీ విభాగమును నెలకొల్పియున్నారు. గుజరాతులోని పాఠశాలలన్నిటిలోను రెండు లిపులలోను హిందీ ప్రచారము చేయుట దానిపనియయియున్నది. గుజరాతీభాషీయుల ఉప యోగము కొఱకు, ఆ విభాగము హిందీ పుస్తకములనుకూడ ప్రచురించియున్నది.

శ్రీ కలేల్కారు సంచాలకత్వమున, వర్ధాసమితీవారు పశ్చిమ భారతమందంతట చిన్నతరగతులనుండి పెద్దతరగతులవఱకు పరీక్షలు జరుపుచుండిరి. ఇందూరు సమావేశములలో నిర్ణయింప బడినట్లు మునుముందుగా దేవనాగరి లిపిద్వారా హిందీబోధ జరుగుచుండెను. తరువాత కొంతకాలమునకు ఉర్దూలిపి నేర్పుటకు నిశ్చయింపబడెను. గుజరాతు విద్యాపీఠమువారి ఉద్దేశములలో పరీక్షలు నడపుట ప్రధానము కాకపోవుటవలన, వారాపరీక్షలు నడప రయిరి. అట్లు నడపకపోయినను పరీక్షలు జరిపించుటకు ప్రోత్సాహ మిచ్చుచుండిరి. శ్రీ కాకాసాహెబుకలేల్కారే ఆ పనులను స్వయముగా చూచుచుండిరి.

1937 లో బొంబాయి గవర్నమెంటువారు శ్రీ కాకా కలేల్కారు అధ్యక్షతను "హిందుస్తానీ బోధనాసమితి" ని ఏర్పాటు చేసిరి. బొంబాయి రాజ్యమందంతట పాఠశాలలలో అయిదవ తరగతి మొదలు హిందీబోధ చేయుటయే ఆ సమితివారి అభి ప్రాయము. ఇందూరు నిర్ణయముల ప్రకారమే హిందీబోధనకు ఏర్పాట్లు చేయబడెను. పాఠ్యక్రమములో హిందీ, ఉర్దూ లిపులు రెండింటికి ప్రాధాన్య మివ్వబడెను.

బొంబాయి గవర్నమెంటువారు తమ విధానము నిట్లు నిర్దేశించిరి:

(1) యావద్భారతదేశములో పెక్కుండ్రు ప్రజలచే మాట్లాడు భాషకు 'హిందుస్తానీ' అని పేరు. దేశమందంతట ఆ భాషయే సర్వసామాన్యముగా వాడబడుచున్నది.

(2) ఆ భాషను దేవనాగరి, ఉర్దూ లిపులు రెండిటిలోను నేర్వవచ్చును.

(3) విద్యార్థులు ఏదేని ఒక లిపి ద్వారా భాషను నేర్చుకొనవచ్చును. కాని ఉపాధ్యాయులు మాత్రము రెండు లిపులను నేర్చియుండవలెను.

(4) బొంబాయి రాజ్యమందలి ప్రభుత్వాదరము పొందినపాఠశాలలన్నిటిలోను ఆ భాష క్రమముగా నిర్బంధము చేయబడును. ఆ భాషా బోధనకు రెండు లిపుల లోను ఏర్పాట్లుచేయబడగలవు.

వర్ధా సమితివారు గుజరాతు, మహారాష్ట్ర ప్రాంతములలో హిందీ ప్రచారము చేయుచుండుటవలన ఆ సమితివారిచేత కూడ ఈ విధానమును ఆమోదింప జేయవలెనని శ్రీ కాకాసాహెబు కలేల్కరు పాటుపడియున్నారు. ఇంతవఱకును ఏక ముఖముగా నడచిన ప్రచారకార్యము ఇంతటినుండి రెండు మార్గములలో చీలిపోయినది. హిందీ సాహిత్యసమ్మేళనమువారు ఈ విధానమును అంగీకరింపలేదు. హిందీభాష, ఉర్దూకంటె భిన్నమయినదనియు, అందువలన ఒక్క నాగరిలిపికొఱకును, దానితో గూడుకొన్న హిందీభాష కొఱకును తాము పాటుపడెదమనియు వారు స్పష్ట ముగా చెప్పిరి.

*వర్ధా హిందుస్తానీ ప్రచారసభ ప్రారంభము :*

హిందీ, ఉర్దూభాషల సమన్వయరూపమునకు అనువుగా నుండునట్లు భాషా ప్రచారము చేయుటకుగాను, వర్ధా సమితివారికి స్వాతంత్ర్య మీయవలసినదని గాంధీజీ సమ్మేళనమువారిని కోరియుండిరి. ఆ విధముగా వా రంగీకరించిన యెడల హిందీ ప్రచారమునకు సమ్మేళనమువారు తమకు చేతనైనంత సహాయము చేయుటకు వీలుండెడిది. 1940-41 వఱకు ఈ చిక్కు సమస్య విడిపోవనే లేదు. ఆ సంవత్సరము, సమ్మేళనమువారు గాంధీజీ పద్ధతిని తిరస్కరించుటతో ఈ చిక్కు తొలగిపోయినది. సమ్మేళ నమువారు వర్ధాసమితిని స్వతంత్రముగా చేయుటకుగాని, తమ

చేతులలోనుండి విడిచి పెట్టుటకుగాని, సమ్మతింపరయిరి. అందు వలన ఈ హిందీ ప్రచారముకొఱకు పాటుపడుచున్న గాంధీజీ, పండిత జవాహరులాలుజీ, మౌలానా ఆజాద్, బాబు రాజేంద్ర ప్రసాదు మున్నగువా రందఱును కలిసి వర్ధా హిందుస్తానీ ప్రచార సభను క్రొత్తగా స్థాపించిరి. గాంధీజీ హిందీ సాహిత్యసమ్మేళనము వారి సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. అట్లు రాజీనామా చేసి నప్పటికిని సమ్మేళనమువారు తమ హిందీ ప్రచారములో గాంధీజీ పేరును ఉపయోగించుకొనుచునే ఉండిరి. హిందీసాహిత్య సమ్మేళనమువారి హిందీప్రచారము ఒంటికంటి చూపుమాత్రమే యనియు, రెండవ కన్ను ఉర్దూ అనియు, గాంధీజీ చెప్పుచుండిరి. నేటివఱకును సమ్మేళనమువారి చూపులో మార్పురాలేదు. ఉర్దూ కంటె భిన్నమయిన హిందీయే యావద్దేశీయ భాషగా నుండదగిన దని వారు ప్రచారము చేయుచున్నారు. ఉత్తరప్రదేశీయుల హిందీని గాంధీజీ హిందుస్తానీ అను పేరుతో పాడుచేయుచున్నారనియు, హిందీ ఉర్దూల కలయిక పనికిరాదనియు, సమ్మేళనమువారువాదించు చున్నారు.

రెండు హిందీలు :

రాజ్యాంగశాసనములో రెండు హిందీలు చెప్పబడినవని సమ్మేళనమువా రనుచున్నారు. ఈ విషయమయి మరల వేఱొక చోట ప్రసంగించెదను. సమ్మేళనమువారి చూపులో నున్న హిందీ వేఱు, గాంధీజీ ప్రచారము చేయుచున్న హిందీ హిందుస్తానీ వేఱని, సమ్మేళనమువారు చెప్పుచున్నారు. హిందుస్తానీ ప్రచారసభవారు

జాతీయభాషను గురించి చేసిన నిర్వచనములో ఈ విషయము స్పష్టముగా తెలిపోగలదు. ఆ నిర్వచన మిది—

ఉత్తర హిందూస్తానములోని పల్లెలలోను, పట్టణములలోను హిందువులు, ముసల్మానులు మొదలగువారు ఏ భాషను మాట్లాడుచు, అర్థముచేసికొనుచు, వ్యవహరించుకొందురో, దేనిని నాగరి, పారసీ లిపులలో వ్రాయవచ్చునో, దేని సాహిత్యము హిందీ, ఉర్దూ పేరులతో పిలువబడుచున్నదో, ఆ భాష హిదుస్తానీ.

1950 లో చేసిన రాజ్యాంగశాసనములో 351 సూత్రములో వివరణ నిమిత్తం ఈ దిగువ అంశముకూడ చేర్చబడినది.

"ఆ భాష తన శక్తిని పెంచుకొనుటకుగాను ప్రాంతీయభాషలనుండి అవసర మైన శబ్దములను, జాతీయములను స్వీకరించుచుండగలదు."

సాహిత్య సమ్మేళనమువారు ప్రతిపాదించుచున్న హిందీ కేవలము ఉత్తర ప్రదేశమునకు మాత్రమే సంబంధించి యున్నది. కాని హిందుస్తానీప్రచారసభవారి నిర్వచనము అంతకంటె చాల ఉదారమయినది. నేటికిని ఆ తేడా ఉండనేఉన్నది. 8 వ షెడ్యూలులో ఉదాహరింపబడిన హిందీ, ప్రాంతీయభాష, 343, 351 సూత్రములలో నిర్వచింపబడిన హిందీ, ఇండియను యూనియను భాష. స్వరాజ్యానంతరము 1950 నుండి ఈ రెండు హిందీలు వేఱని చెప్పబడుచున్నవి. అప్పటినుండి హిందీ ప్రచారోద్య మములో మూడవదశ ప్రారంభమగుచున్నది.

ఈ మూడవదశలో జరిగిన పనిని గుఱించి విచారించుటకు ముందు, మఱియొక సంగతిని ఆలోచింపవలసి యున్నది. గాంధీజీయును, తదనుయాయులును స్పష్టముగా వేరొక మార్గము త్రొక్కినందువలన హిందీ ప్రచారములోని అనధికార కార్య

క్రమములో కూడ స్పష్టమయిన మార్పు వచ్చినది. గుజరాతులో శ్రీ కాకా కలేల్కరు తాము చేయుచున్న పనిని గుజరాతు విద్యా పీఠమునకు వప్పగించియున్నారు. హిందుస్తానీ పద్ధతి ననుసరించి స్వతంత్రమగు పరీక్షవిధానము ఏర్పఱుపబడినది. అప్పుడు కొందఱు హిందీప్రచారకులు ఈ ఉద్యమమునుండి తప్పుకొని, గుజరాతులో వర్ధాసమితివారి కార్యక్రమమును కొనసాగించుటకు ప్రాతినిధ్యము వహించియుండిరి. సాహిత్య సమ్మేళనమువారి విధానము నంగీకరింపని మరికొందరు ప్రచారకులు మహారాష్ట్రములో ఒక స్వతంత్రసంస్థను స్థాపించి పరీక్షవిధానమును వేఱుగా నడపుకొనుచున్నారు. మదరాసులోని దక్షిణభారత హిందీ ప్రచార సభవారు ఈ క్రొత్తపద్ధతి నంగీకరించి 'హిందీ' అనుటకు బదులు 'హిందుస్తానీ ప్రచారసభ' యని పేరును మార్చుకొనిరి.

అసలు ఈ విభేదములు 1912-47 సంవత్సరములలో బయలుదేరినవి. అప్పుడు దేశము (క్విట్ ఇండియా) "ఇండియా నుండి లేచిపొండి" అను మహోద్యమములో చిక్కుకొని యుండెను. ఆ ఉద్యమానంతరము, భారతము వేఱుగాను, పాకిస్తాను వేఱుగాను రెండురాజ్యము లేర్పడినవి. 1948 లో గాంధీజీ స్వర్గము నలంకరించిరి. అంతట ఈ భాషాసమస్య, రాజ్యాంగ పరిషత్తువారి చేతులలోనికి పోయినది. వారు ఆ విషయమును పరిష్కరించి రాజ్యాంగ శాసనములో పొందుపఱచియున్నారు. దానితో ప్రచారోద్యమములోని మూడవదశ ప్రారంభమగుచున్నది. అయినను ఈ కాలములోను నూతన సమస్యలు ఏర్పడినవి.

## 8. మూడవ దశ

1949 లో రాజ్యాంగ పరిషత్తువారు ఈ భాషా సమస్యను పరిష్కారము చేసియున్నారు. మొదటి రెండు దశలలోను జరిగిన ప్రచారఫలితమే రాజ్యాంగ శాసనములోని నిర్వచనము అని చెప్పవచ్చును. అది ఉద్యమ ప్రచారకులకు గలిగిన విజయమే. ఈ విషయమయి డాక్టరు ఎం. ఎస్. పటేలు తమ గ్రంథములో ఇట్లు వ్రాసియున్నారు.

"హిందీ, యావద్భారత భాషగా ఉండగలదని రాజ్యాంగ పరిషత్తువారు తీర్మానించియున్నారు. నేటికంటె ఆ భాష మహోన్నతిని పొందగలదు. దానికిని హిందుస్తానీకిని భేదమింక కనబడదు. గాంధీజీ సూత్రీకరించిన ప్రధానాంశములను రాజ్యాంగ పరిషత్తు వారంగీకరించియున్నారు. అంతేగాక రాధాకృష్ణన్ కమిషను వారును ఆమోదించియున్నారు. ఈ కమిషనులో ఇండియా, ఇంగ్లాండు, అమెరికాల లోని సుప్రసిద్ధులగు విద్యావేత్తలు సదస్యులుగా నుండి పనిచేసిరని జ్ఞాపకముంచు కొనవలెను."

*రాజ్యాంగశాసనము - హిందీ :*

కేంద్ర ప్రభుత్వములోను, ప్రాంతీయ ప్రభుత్వములోను ఉపయోగింపబడవలసిన భాషా స్వరూపము, రాజ్యాంగశాసనము 17 వ విభాగము, 343 మొదలు 351 సూత్రములలో, నిర్దేశింప బడినది.

"343 (1). భారత యూనియను అధికార భాష హిందీ. అది దేవనాగరి లిపిలో వ్రాయబడును. భారత యూనియనులో ఉపయోగింపబడు అంకెలు, భారత సంఖ్యల అంతర్జాతీయ రూపములు.

351. హిందీ భాషను వ్యాపకముచేయుట యూనియను గవర్నమెంటు వారి కర్తవ్యము. భారతీయ సమ్మిశ్రితసంస్కృతిని వ్యక్తీకరించునట్లుగాను, హిందుస్తానీలో గల ప్రతిభాసంపదకు, రూపమునకు శైలికి భంగము కలుగనట్లుగాను, 8 వ షెడ్యూలులోని ఇతరభాషలలోని విశేషములను ఇముడ్చుకొనుచును. ఆ భాష

అభివృద్ధిపొందవలెను. శబ్దసముదాయము కావలసివచ్చినప్పుడు ప్రధానముగా సంస్కృతమునుండియు, రెండవ పక్షములో ఇతర భాషల నుండియు అద్దానిని సమకూర్చుకొనుచుండవలెను. 8వ షెడ్యూలులో హిందుస్తానీతో పాటు ఈ దిగువ భాషలు గలవు: (1) అస్సామీ (2) బెంగాలీ (3) గుజరాతీ (4) హిందీ (5) కన్నడము (6) కాశ్మీ (7) మళయాళము (8) మరాఠీ (9) ఓఢ్రము (10) పంజాబీ (11) సంస్కృతము (12) అరవము (13) తెలుగు (14) ఉర్దూ.

అంతఃప్రాంతీయ భాషకు ఉపయోగింపబడవలసిన లిపి, దేవనాగరి లిపి యనియు, అంకెలు ఇంగ్లీషు అంకెలనియు 343వ సూత్రములో స్పష్టముగా తేల్చి చెప్పబడినది. ఈ అంకెలను గుఱించి హిందీ సాహిత్య సమ్మేళనమువారును, మఱికొందఱు ఉత్తర భారతీయులును తీవ్రముగా వ్యతిరేకించుచున్నారు. రాజ్యాంగ శాసనములో ఉర్దూ ప్రత్యేక భాషగా నిబంధింపబడినప్పటికిని, వారు దానినికూడ వ్యతిరేకించుచున్నారు. ఇంగ్లీషు అంకెలు ద్రావిడ భాషలలోను, ఉత్తరదేశములోని ఉర్దూలోనుకూడ ఉపయోగింపబడు చున్నవి. అందువలన రాజ్యాంగములో ఆ అంకెలను అంగీకరింప వలసి వచ్చినది. 351 సూత్రములో హిందీ భాషాభివృద్ధికి సాధనములు చెప్పుచు, ప్రాంతీయ భాషలనుండియు శబ్దసమూహము చేర్చుకొనబడునని చెప్పబడినది. ఇది రాజ్యాంగ శాసనకర్తల విశాలదృష్టికి ఉదారాశయములకు ప్రమాణము. సంకుచిత హిందీ భాషావాదులు ఈ పద్ధతినికూడ వ్యతిరేకించుచున్నారు. ఈవిధముగా వారు వ్యతిరేకించుట వల్లనే 1942 లో హిందూస్తానీ ప్రచారసభను స్థాపించుటకు కారణ మేర్పడినది. 1950 లో స్వరాజ్యానంతరము కూడ స్థితిగతులు ఇట్లే యున్నవి. హిందీ భాషావాదులు తమ సంకుచితప్రాంతీయతత్త్వమును కులతత్వమును విడిచిపెట్టలేక

పోవుచున్నారు. దీనికితోడు మఱికొన్ని క్రొత్తచిక్కులుకూడ కలిసినవి.

351 వ సూత్ర ప్రకారము, కేంద్ర ప్రభుత్వమువారును, ప్రాంతీయ ప్రభుత్వములవారును హిందీభాషా వ్యాపనమును చేయవలసి యున్నారు. ఆ విధముగా హిందీభాషా ప్రచారము గవర్నమెంటు విధులలో నొకటిగా ఏర్పడినది. 15 సంవత్సరముల లోపల హిందీ, ఇంగ్లీషు స్థానములను ఆక్రమింపవలసియున్నది. ఆ విధముగా హిందీ పెంపొందుటకు గవర్నమెంటు పాటుపడ వలసి యున్నది.

ఇప్పటికప్పుడే ఆఱు సంవత్సరములు గడిచిపోయినవి. ఈ కాలములో చెప్పదగినంత హిందీ ప్రచారము జరిగియుండ లేదు. ఇంత చీమనడకతో వ్యవహారము నడచుట కనేక కారణము లున్నవి. మొదటిది: పాలక వర్గీయులకును, ఉన్నత శ్రేణిలోని వారికినిగల ఇంగ్లీషు వ్యామోహము ఇంతింతనరానిది. వారు సంకుచిత భావములను గలిగియుండుటయేగాక, క్రొత్త మార్పు నకు వ్యతిరేకతకూడ చూపుచున్నారు. ఇంగ్లీషు, వారికి తాతగారి ముల్లెవలె ఏర్పడినది. దానిపయి తమకు హక్కు గలదని వాదించు చున్నారు. ఈ విషయమై సర్ ఐవర్ జెన్నింగ్సు అను ఆయన 1949 లో ఆక్సుఫర్డులో ఉపన్యాసములు చెప్పుచు ఇంగ్లీషువల్ల ఉన్నతశ్రేణి హోదా యేర్పడుటయేగాక, దానివలన బోలెడంత ధనలాభము గలుగుచున్న"దని కూడ చెప్పియున్నారు.

భారతీయసమాజములో ఇంగ్లీషునకు ఎటువంటి ప్రధానస్థానము లభించినది, ఆ సంగతులు కూడ సర్ ఐవర్ తమ ఉపన్యాసములలో చెప్పియున్నారు.

"'మెకాలే' యను ఇతర ప్రజాపక్షవాదులును ఇంగ్లీషు భాష ద్వారా గొప్ప విజ్ఞానవ్యాప్తి జరుగునని ఆశించియుండిరి. అట్లు జరుగలేదు. అల్పముగా మాత్రమే విజ్ఞానవ్యాపకము జరిగినది. ఆ భాష వలన, ఇంగ్లీషు విద్యావేత్తలను శ్రేణి ఒకటి ఏర్పడినది. వారికిని సామాన్యప్రజలకును గల సంబంధము దూరమయిపోయినది. ఈ అంతరము మొగలు సామ్రాజ్యములోకంటె ఎక్కువయినది. అయితే ఇంగ్లీషు భాష ద్వారా రాజకీయచైతన్యము కలిగినది. వారందఱు ఏకాభిప్రాయముగలవారయి ఏకభాష మాట్లాడుకొనసాగిరి. దాని మూలమున మతపక్షములు కూడ ఏర్పడినవి. భారతీయసమాజము చాల చిక్కులతో నున్నందువలన పశ్చిమదేశ సంప్రదాయములు అమలుజరుపవలసి వచ్చినప్పుడు మతపక్షములు ఏర్పడుట సంభవించెను"

ఇంక ఇంగ్లీషునకు బదులు ప్రాంతీయభాషలు ప్రవేశపెట్టు సందర్భములో ఆయన ఈ క్రింది పరిష్కార మార్గమును సూచించిరి.

"ఇంగ్లీషుకు బదులుగా ప్రాంతీయభాషలను ప్రవేశపెట్టదలచిన యెడల కలకత్తా, మదరాసు, బొంబాయి యూనివర్సిటీలను, చిన్నచిన్న యూనివర్సిటీలుగా విభజింపవలెను. వేఱువేఱు భాషలకు గాను వేఱువేఱు యూనివర్సిటీలుగా నుండవలెను. అటువంటివి, ఇండియాలో చాల ఉండగలవు. ఆ విధముగా విభజించినందువల్ల పై యూనివర్సిటీలను భిన్నభిన్నముగా చేయుటయే కాక, వృత్తులు, వ్యాపారములు, పరిశ్రమలు కూడ భిన్నభిన్నము లయిపోవును. అట్లు కాకుండపోవుటకు ఒక్కటేమార్గముగలదు. అదేమనగా హిందీని రెండవభాషగాఉపయోగించుటయే."

మనదేశములో ఎంతో భిన్నత్వము ఏర్పడియున్నది. ఇట్టి సందర్భములో ఏకత్వమును సాధింపవలెనన్న, ఆ పని హిందీ ద్వారానే జరుగవలెను. ఆ విధముగా మనము ఐకమత్యమును సాధింపగలము. సర్ ఐవర్ దృష్టిలో, ఒక్క హిందీభాషనే వృద్ధి చేయవలెనను అభిప్రాయము లేదు. అది రెండవభాషగా మాత్రమే ఉండవలెననియు, మొదటిభాష ప్రాంతీయభాష అనియు వారి అభిప్రాయము.

*హిందీ ఉద్యమములో నూతనాంశములు :*

ఉత్తర భారతీయులు, హిందీ ఆధిపత్యమును, హిందీ సామ్రాజ్యతత్త్వమును ప్రవేశపెట్టుచున్నారను భయముతోనే నూతనాంశములు ఏర్పడుచున్నవి. ఇండియను యూనియనువా రంగీకరించిన హిందీ తమ స్వంతభాషయేయని హిందీ మాతృ భాషావాదుల వాదము. ఈ అభిప్రాయమునే వారు ప్రచారము చేయుచున్నారు. భారత రాజ్యాంగమువారు నిర్ణయించిన హిందీని, సాహిత్య సమ్మేళనమువారు అంగీకరించి యుండలేదు. ఒకవేళ అంగీకరించినను, నిండుమనస్సుతో అంగీకరించి యుండలేదు. యూనియను గవర్నమెంటువారంగీకరించిన అంకెలను, సమ్మేళ నమువారు బొత్తిగా అంగీకరించి యుండలేదు. ఈ విధమయిన అభిప్రాయములు కలిగినవారిలో శ్రీ కె. యం. మున్షీ ఒకరు. 1952 లో, బొంబాయిలో జరిగిన హిందీ సాహిత్యసమ్మేళన మహాసభకు వారు అధ్యక్షులుగా నుండిరి. ఆ సమయమున హిందీ సాహిత్య ప్రగతిని గురించి వారీక్రిందిమాటలు చెప్పిరి.

"అదంతయు ఒక చిత్రగాథ. ఒక వంద సంవత్సరముల క్రిందట కొందఱు విద్వాంసులగు మహనీయులు హిందీభాషా బీజములను నాటియుండిరి. ఉత్తర భారతములో ఉర్దూ, చదువుకొన్నవారి భాషగానుండి యుండెను. హిందీభాష ఉత్పత్తికి కారకులయినవారు ఆ ఉర్దూను అంగీకరించి యుండలేదు. వారు ముందు వెనుకలను ఆలోచించియే అట్లు చేసియుండిరి. ఈ రోజున హిందీభాషకు విజయము కలిగినది. ఈనాడది అనుదిన వ్యవహారములలో వ్రాతకోతలకును, సంభాషణకును పనికి వచ్చుచున్నది."

గాంధీజీ సంకల్పించిన, ప్రతిపాదించిన హిందుస్తానీ లోతుగా పాతిపెట్టబడినదనిన్ని, అది యింక జీవములతో తల

యెత్త జాలదనిన్ని, శ్రీ మున్షీయే మఱియొక సందర్భములో చెప్పి యున్నారు. కనుక శ్రీ మున్షీగాని, హిందీ సాహిత్య సమ్మేళనము వారుగాని, పేర్కొనుచున్న హిందీ, యూనియను గవర్నమెంటు వారు నిర్ణయించిన హిందీ కాదని స్పష్టముగా తెలియగలదు. కారణ మేమనగా 351 సూత్రములో ఉర్దూ, హిందుస్తానీలను వ్యతిరేకింపజాలమని చెప్పబడినది.

స్వరాజ్యము వచ్చిన తరువాత, హిందీకినీ, రాజకీయముల లకును ముడిపెట్టబడినది. ఉత్తర భారతీయులలో కొందఱి కోరిక ప్రకారము వారి హిందీ, ఉర్దూ హిందుస్తానీలకంటె భిన్నమయిన యెడలను, అదే యూనియను భాషగా అంగీకరింపబడినయెడలను, ఆ భాష పార్లమెంటులోను, తదితర సంస్థలయందును ఉపయోగ పడవలసివచ్చును. హిందీ సాహిత్య సమ్మేళనమువారు (అలహాబాదు) అహిందీ ప్రాంతములలో తాము నిర్వచించిన హిందీనే తమ వర్ధా సమితి ద్వారా ప్రచారము చేయుచున్నారు. వారు పాకిస్తానమునకు వ్యతిరేకముగా కూడ నున్నారు. అంతేగాక యూనియను హిందీని ప్రచారము చేయుచున్న మహారాష్ట్ర రాష్ట్ర భాషా సభ (పూనా), గుజరాతు విద్యాపీఠము (అహమదాబాదు) వారిని కూడా ఎదిరించుచున్నారు. హిందీ సాహిత్య సమ్మేళనము వారు కొనసాగించుచున్న హిందీ ప్రచారము, రాజ్యాంగ శాసనము ప్రకారము తప్పని అధికార పూర్వకముగా ఒక్కరును వక్కాణించి యుండలేదు. ఆ విధముగా మొట్టమొదటిసారి తిరస్కరించిన వారు బొంబాయి రాజ్యమువారు. అది ఏ సందర్భములో జరిగినదో ఈ క్రింద వివరించెదను.

హిందీ సామ్రాజ్యవాదుల వలన భయము :

రాజ్యాంగ శాసనము ప్రకారము, హిందీ భాషా విధానము ఎట్లుండవలెను? విద్యా సంస్థలలోను, వైజ్ఞానిక వ్యవహారములలోను ఆ భాషా రూపమెట్లుండవలెను? ఇప్పుడు ముఖ్యముగా ఇంగ్లీషు స్థానమును హిందీ ఆక్రమింపవలసియున్న తరుణమున గవర్న మెంటు ఉద్యోగములకు తీసుకొనవలసిన వారికి కావలసిన హిందీ రూపమేమి? ఈ మొదలగు విషయములను గురించి అహిందీ ప్రాంతీయులలో పుట్టెడు భయమేర్పడియున్నది. ఈ సందర్భ ములో శ్రీ ఐవరుజెన్నింగ్సు ఏమి చెప్పియున్నారో చూడుడు.

"హిందీని జాతీయభాషగా అంగీకరించినయెడల, ఇప్పుడు ఇంగ్లీషుమాట్లాడు వారు ప్రముఖులుగా నున్నట్లే, హిందీ మాతృభాషగానున్న ఉత్తరప్రాంతీయులు ప్రముఖులుగా నుండగలరు. ఇంగ్లీషు తటస్థముగా నయినను ఉన్నది. దీనిని అందరు నేర్వవచ్చును. కాని హిందీవల్ల కొందరకు ప్రాధాన్య మేర్పడును. మఱి కొందరకు అప్రాధాన్యము గలుగును."

ఈ సందర్భములోనే "శ్రీ జె. యన్. బోరా" అను భారతీయులొకరు గౌహతి (అస్సాము) నుండి ఒక కరపత్రమును ప్రకటించి యున్నారు. హిందీకంటె సంస్కృత ప్రచారము మంచిదనిన్ని, హిందీ ఒకప్రాంతమువారికి మాతృభాషగా నున్నదనిన్ని, హిందీకి ప్రాధాన్యము ఇచ్చినయెడల అక్కడివారు ప్రముఖులుగా నుండగలరని, వారికి అన్ని రంగములలోను ప్రధానస్థానమే లభించుననిన్ని, సంస్కృతమయినచో ఇటువంటి ఇబ్బందులుండవనిన్ని, వారా కరపత్రములో చర్చించి యున్నారు.

*సంస్కృతము - ఇంగ్లీషు :*

దక్షిణ భారతములో నున్న ప్రజలను, తూర్పుభారతములో నున్న ప్రజలను ఈ దిగువ రెండు సూచనలు చేసియున్నారు. (1) ఇంగ్లీషును నిలుపుకొన్నయెడల మన ఆత్మగౌరవమునకు భంగమురాదు. కాలపరిమితితో నిమిత్తము లేకుండ ఎంతకాల మయినను మనము ఆ భాషను నిలుపుకొనవచ్చును. (2) అంతః ప్రాంతీయభాషగా మనము సంస్కృతమును ఏర్పఱచుకొన వచ్చును. అప్పుడందఱకును సమానావకాశములే యుండగలవు. దేశవిభజన జరిగినవెనుక కొందఱు హిందూ సంస్కృతిని ఉద్ధరింప వలెనని కోరుచుండిరి. అటువంటివారికి సంస్కృతప్రచారము వలన సంతృప్తి కలుగగలదు. అయితే ఈ పద్ధతి మంచిదికాదు. ఉన్న స్థితిగతులను కప్పిపుచ్చుటకు మాత్రమే ఈ సూచన ఉపక రింపగలదు. హిందీ ప్రచారోద్యమమునకు ఇది అనుకూలింపదు. ఆ ప్రాంతములలో హిందీబోధ జరుగుటకు ఈ పద్ధతివలన అనుకూల స్థితిగతులు ఏర్పడవు. 351 సూత్రము ప్రకారము కేంద్రములో గాని, ప్రాంతములలో గాని సమర్థతతో భాషా ప్రచారము జరుగుటకు వీలుండదు.

ఇక ఇంగ్లీషును నిలుపుకొన్నయెడల, రాజ్యాంగశాసనము ప్రకారము హిందీప్రచారము విరివిగా జరుపుకొనుటకు వీలుండదు. సంస్కృతభాషా ప్రచారమువల్ల కూడ హిందీని తిరస్కరించుటయే కాగలదు. అనగా ఇంగ్లీషును నిలుపుకొనుటయు, ఉన్న స్థితిగతులను ఉన్నట్లే ఉంచుకొనుటయు సంభవించును. ఏవిధముగా చూచినను

ఈ రెండు సూచనలవల్లను హిందీ ప్రచారమునకు ఆటంకములే కలుగగలవు.

పశ్చిమ భారతములో హిందీ ప్రచారము :

పశ్చిమ భారతములో అనగా బొంబాయి రాజ్యములో శ్రీ బి. జి. ఖేరు కాంగ్రెసు ముఖ్యమంత్రులుగా నుండిరి. వారి యాజమాన్యమున హిందీ ప్రచారమునకొక నూతనరూపము ఏర్పడినది. ఆ రాజ్యములోని పాఠశాలలలో హిందీబోధ అంతకు ముందునుండియే జరుగుచున్నదని చెప్పియున్నాను. ఇప్పుడు రాజ్యాంగ శాసనములోకూడ హిందీ ప్రచారమునుగూర్చి నిర్ధారణ జరుగుటవల్ల అక్కడ జరుగుచున్న పనికి మఱికొంతబలము వచ్చినది. ఉత్తరభారతములో అమలు జరుగవలసిన భాషాస్వరూపమును గుఱించికూడ వారొకమార్గమును సూచించిరి. హిందీ ప్రచారము విషయములో బొంబాయి గవర్నమెంటువారు ఏవిధమయిన మాంద్యమును చూపియుండలేదు. బొంబాయి రాజ్యములో 343-51 సూత్రముల ప్రకారము హిందీ ప్రచారమును ప్రోత్సహించుటకుగాను సూచనలు చేయవలసినదని, ఆ గవర్నమెంటువారు 1950 మేనెలలో "హిందీ బోధనాసమితిని" ఏర్పఱచియున్నారు. రాజ్యాంగ శాసనము అంగీకరింపక పూర్వమునుండియే అనగా 1949 కు పూర్వమునుండియే ఆ రాజ్యములో హిందీ భాషా ప్రచారము జరుగుచుండెను. వర్ధాసమితివారు ప్రచారము చేయుచున్న ప్రాంతీయ హిందీ, హిందీ కాదనియు, గాంధీజీ ప్రచారము చేయుచున్నట్టియు, కాంగ్రెసు మహాసభ ఆమోదించినట్టియు

హిందీ - హిందుస్తానీయే హిందీయనియు ఆ రాజ్యమువారు సరి యయిన మార్గములో జాతీయ భాషాప్రచారము చేసియున్నారు. అయితే రాజ్యాంగ పరిషత్తువారి నిర్ణయము నిమిత్తము కొంత కాలము వారు వేచియున్నారు. 1950 లో రాజ్యాంగ శాసనము అమలులోనికి వచ్చినప్పటినుండియు బొంబాయి గవర్నమెంటు వారు పైవిధముగా "హిందీ బోధనాసమితి"ని ఏర్పఱచి యున్నారు.

*బొంబాయి హిందీ బోధనాసమితి :*

ఈ సమితివారు తమ నివేదికను ప్రకటించియున్నారు. రాజ్యాంగ శాసనము ననుసరించి జరుగవలసిన హిందీ ప్రచారమును గురించి స్పష్టమయిన సూచనలు చేసిన దీసమితివారే మొట్టమొదటివారు. ఈ నివేదిక ఇంకను అధికముగా వ్యాప్తి చెంది యుండవలసినది. హిందీ ప్రచార వ్యాపకమును గుఱించి కేంద్రములోను, ప్రాంతములలోను ఏర్పడిన చిక్కులను గుఱించి ఆ రిపోర్టు వారు కొంతవఱకు చర్చించియున్నారు. (1) అహిందీ ప్రాంతములలోని పాఠశాలలలో ఏయే పద్ధతులప్రకారము హిందీ బోధను జరుపవలెను. (2) విద్యాలయములలో బోధించు హిందీ స్వరూప మెటువంటిది? (3) హిందీ ఉపాధ్యాయులకు ట్రెయినింగు ఇచ్చుట ఎట్లు? పాఠ్యగ్రంథములేవి? పాఠ్యక్రమమేమి? ఈ మొదలగు విషయములు ఆ నివేదికలో చర్చింపబడినవి. బొంబాయి రాజ్యములో హిందీ ప్రచారము చేయుచున్న అనధికార సంస్థలను ఏ పద్ధతులమీద అంగీకరింపవలెను? బొంబాయి గవర్నమెంటు ఉద్యోగులు, (అనధికార సంస్థలు నడపుచున్న) ఏఏ హిందీ పరీక్షలు

ప్యాసు కావలెను ? ఈ విషయములను గురించియు సిఫార్సులు చేయవలసినదని పై సమితివారు కోరబడియున్నారు.

ఆ సమితివారు చేసిన సూచనలన్నియు భారత రాజ్యాంగము వారు అంగీకరించిన హిందీ ననుసరించియే యున్నవికాని, ఎనిమిదవ షెడ్యూలులో ఉదాహరించిన ప్రాంతీయ హిందీకి అనుకూలముగాలేవు. రాజ్యాంగము వా రంగీకరించిన హిందీ వేఱు, ప్రాంతీయ హిందీ వేఱు అని ఆ రిపోర్టు నిర్మాతలు స్పష్టముగా వ్రాసియున్నారు. రాజ్యాంగమువారంగీకరించిన భాషనే పాఠశాలలలో బోధ చేయవలసినదని ఆ రిపోర్టులో చెప్పబడినది. ఆ హిందీభాషా విధానమును అంగీకరించిన అనధికార హిందీ సంస్థలనే గవర్నమెంటువారు ఆమోదింపదగుదురనియు అందు తెలియజేయబడినది.

బొంబాయి గవర్నమెంటువారు ఆ రిపోర్టులో చేయబడిన సూచన లన్నిటిని అంగీకరించి, ఆప్రకారము హిందీ ప్రచారమునకై తగిన యేర్పాటులు గావించియున్నారు. అయిదవ తరగతి మొదలు పదునొకండవ తరగతివఱకు హిందీని నిర్బంధము చేసియున్నారు. గవర్నమెంటు ఉద్యోగులు కొన్ని హిందీపరీక్షలు ప్యాసుచేయవలసినదని నిబంధించియున్నారు. పరిపాలనా వ్యవహారములకు కావలసిన కొన్ని హిందీ మాటలను సృష్టిచేయవలసినదని ఆ కమిటీవారిని మరల కోరియున్నారు. హిందీ ప్రతిభకు భిన్నము గాకుండ ఇతరభాషలనుండియు శబ్దములు తెచ్చుకొనవచ్చునని 351 సూత్రములో చెప్పినప్రకారము నూతనశబ్దములు సృష్టి చేయబడినవి.

## 9. రెండు హిందీలు

బొంబాయి హిందీ బోధనాసమితివారి నిర్ణయములు కేవలము ఒక ప్రాంతమునకు మాత్రమే సంబంధించినవని అనుకొనరాదు. అవి యావద్భారత దేశములోను ప్రధానమయిన వని యెంచవలెను. ఆ సమితివారు "రెండు హిందీ"లని నిర్దేశించుటవలన ఉత్తర దేశములోని ప్రాంతీయ హిందీ భాషావాదులకు కోపమువచ్చినది. వారు తమ ప్రాంతీయ హిందీని, ఉర్దూకంటెను, హిందుస్తానీకంటెను భిన్నమయినదని ప్రచారము చేయుచున్నారు. అందువలన వర్ధా సమితివారు జరుపుచున్న పరీక్షలను ఆమోదించుటకు అవకాశము లేకుండపోయినది. ఇతర ప్రదేశములలో ఎట్లున్నను, మొత్తమునకు పశ్చిమ భారతములో అనగా బొంబాయి రాజ్యములో, వర్ధా సమితివారి పరీక్షలు గవర్నమెంటు ఉద్యోగులకు పనికిరావని నిర్ణయింబడినది. నాకు తెలిసినంతవరకు ఈ విధముగా జరుగుట ఇండియా గవర్నమెంటు వారికిని ఇష్టమే.

ప్రస్తుత కాలములో ఈ రెండు హిందీల సిద్ధాంతమును, దేశములోని పెక్కండ్రు మహనీయులు ఆమోదించుచునే యున్నారు.

1951 జూను 12 వ తేదీన మైసూరు రాజ్యములోని 'తుంకూరు' గ్రామములో ప్రమాణపత్రవితరణోత్సవము జరిగినప్పుడు బొంబాయి రాజ్య ముఖ్యమంత్రి శ్రీ బి. జి. ఖేరు తమ అధ్యక్షోపన్యాసములో ఈ క్రింది విధముగా చెప్పియున్నారు.

"నేనింతకు పూర్వమే చెప్పినట్లు, రాజ్యాంగశాసనములో, జాతీయభాష పేరును గురించియు, లిపిని గురించియు నిర్ణయములు జరుగుటవలన, ఇక

ఆవిధమయిన తగాదాలు అంతరించినని గ్రహింపవచ్చును. ఇది శుభసూచకము. అయితే మరియొక చిక్కుగలదు. ఆ విషయమయి మనము జాగరూకులమయి యుండవలెను."

"మన జాతీయభాషకు 'హిందీ' అను పేరుండుటవలన హిందీ మాతృభాషా ప్రాంతములవారు కొందఱు తమ హిందీయే జాతీయభాష హిందీయని వాదించు చున్నారు. ఒక ప్రాంతములోని భాష, యొుపద్దేశ భాష ఎన్నడును కాజాలదు రాజ్యాంగ శాసనములో నిర్ధయింపబడిన హిందీ నెమ్మదిగా రూప నిర్మాణము చేసుకొనవలసియున్నది. ఉత్తర ప్రదేశము, బీహారు, మధ్యప్రదేశములలోని హిందీకిని, పై జాతీయ హిందీకిని సంబంధములేదు. అయితే పై మాతృభాషా హిందీవాదులు, జాతీయ హిందీ నిర్మాణమునకు తోడ్పడదగుదురు. ఆ హిందీ వేఱు, ఈ హిందీ వేఱు అని నిరూపించుటకొఱకే మహాత్మాగాంధీ జాతీయభాష హిందీని హిందీ-హిందూస్తానీ అనిగాని హిందూస్తానీ అనిగాని పేర్కొనియున్నారు."

(హరిజన్ 14-7-51)

రాజ్యాంగ శాసనములోని హిందీని గురించి నేను 23-6-51 తేదీ గల "హరిజను"లో వ్యాసము వ్రాసియున్నాను. ఆ విషయమై శ్రీ ఘనశ్యామ సింహగుప్త (మధ్యప్రదేశ్) 22-9-51 "హరిజను"లో ఇట్లు వ్రాసియున్నారు.

"ది 23-6-51 న శ్రీ మగన్‌భాయిదేశాయి "హరిజను"లో వ్రాసిన వ్యాసమును శ్రద్ధగా చదివియున్నాను. నేను వారి ఉద్దేశములతో పూర్తిగా ఏకీభ వించుచున్నాను. రాజ్యాంగములో నిర్వచింపబడిన హిందీ "సార్వదేశిక"మయినది. అది, ఢిల్లీ, లక్నో, అలహాబాదు, రాయపూరు మున్నగు ప్రాంతములలో మాట్లాడబడు "ప్రాదేశిక" హిందీకంటె భిన్నమయినది. "సార్వదేశిక హిందీని" సమృద్ధము చేయుటకుగాను భారతదేశములోని గొప్పభాషలన్నిటినుండియు శబ్దము లను ఏర్చి కూర్చి, అందు చేర్చవలెను.

ఈ విషయమయి శ్రీ పురుషోత్తమదాసుటండనుజీకిని, శ్రీ కాకా సాహెబునకును కొంత సంభాషణ జరిగినది. ఆ సంగతి 1952 ఫిబ్రవరి "మంగళ ప్రభాత్" పత్రికలో ప్రకటింపబడినది.

"కొలది దినముల క్రిందటనే నేనును పూజ్యశ్రీ టండనుజీయును కలసి హృదయములు విప్పి మాట్లాడుకొంటిమి.

ఈ సందర్భములో శ్రీ టండనుజీ ఇటు చెప్పియున్నారు. "ఉత్తరప్రదేశము వారి ప్రాంతీయహిందీ వేఱు, యావద్దేశీయ హిందీ వేఱు అని కొందఱు ప్రచారము చేయుచున్నారే! ఇదెంత వెఱ్ఱితనము. రాజ్యాంగ శాసనమువారి హిందీని తీసికొని శల్యపరీక్ష చేసి, ఆ హిందీ వేఱు ఈ హిందీ వేఱు అని రెండు హిందీల వాదమును లేవదీయుట ఏమంత సంగతముగా నున్నది?" అని.

అంతట నేనిట్లంటిని. ఈ రెండు హిందీల వాదమును లేవదీసినవారు వీరు కాదు. ప్రొఫెసరు ధీరేంద్రవర్మ ఎన్నడో ఆ వాదమును లేవదీసియున్నారు. "జాతీయభాష యను కిరీటమును మా హిందీభాషకు తగిలించి, దాని స్వరూపమును మీరు మార్చగోరినయెడల ఆ కిరీటమే వద్దని నేను వక్కాణింతును. మా ప్రాంతీయ హిందీ ఈ నా డెట్లున్నదో, అట్లే దానిని ఉండనిండు. కిరీటమునకు ఆశపడి మా హిందీ స్వరూప పరివర్తనమునకు మేమెన్నడును అంగీకరింపము. మీరు జాతీయ భాషను మీ చిత్తము వచ్చినట్లు నిర్మించుకొనుడు. మా హిందీనిమాత్రము చెడ గొట్టకండి." ఇవి వారిమాటలు. ఆ రోజులలో గాంధీజీ హిందుస్తానీ శబ్దప్రయోగ మును చేసియుండలేదు. వారు అప్పుడు సాహిత్య సమ్మేళనములో చేరియేయుండిరి. వారు కేవలము సమన్వయపద్ధతినే కోరుచుండిరి.

మహామహోపాధ్యాయ శ్రీ పోద్దారుజీ గాని, శ్రీ మగన్ భాయి దేశాయి గాని రాజ్యాంగమువారు చేసిన భాషానిర్ణయమును గుఱించి చేసిన వ్యాఖ్యానములను మనము కాదనలేము. ప్రాంతీయ హిందీ వేఱు, దేశీయ హిందీ వేఱు అని స్పష్టముగా కనబడుచునేయున్నది. ఏది యెట్లున్నను, తాత్కాలికముగా ఉన్న యీ భేదము చిరకాలము ఉండదనియు, ఆ విషయములో తమరు గాని మఱి యెవ్వరు గాని ఆందోళనపడవలసిన పనిలేదనియు మాత్రమే తెలియజేయుచున్నాను."

రాజ్యాంగ శాసనములో పేర్కొనబడిన హిందీ వేఱనియు, ప్రాంతీయ హిందీ వేఱనియు ఉద్ఘాటించిన మహనీయులు పెక్కండ్రు గలరు. వారిలో కొందఱి వాక్కులనే ఈ క్రింద ఉదాహరించెదను.

రాజ్యాంగములో పేర్కొనబడిన హిందీని 351 సూత్రము ప్రకారము వ్యాప్తిచేయుటకుగాను 1950 లో అఖిల భారతీయ

హిందీ పరిషత్తు స్థాపింపబడినది. ఢిల్లీ శాసనసభాధ్యక్షులయిన స్వర్గీయ శ్రీ జి. వి. మవలంకరు ఆ పరిషత్తునకు అధ్యక్షులుగా నుండిరి. 1950 జూన్ 24 వ తేదీన బొంబాయిలో సమావేశ మయిన పశ్చిమ భారత రాష్ట్రభాషా సమ్మేళనమునకును వారే అధ్యక్షత వహించిరి. ఆ సందర్భములో వారిట్లు ప్రసంగించిరి.

"యావద్దేశీయభాషకు "హిందీ" యను నామకరణము ఏర్పడినప్పటికిని, అదియును, ఉత్తర ప్రదేశము, రాజస్థానము, మున్నగు ప్రదేశములలో మాట్లాడబడుచున్న హిందీయు ఒక్కటే అనుకొనుట పొరపాటు. హిందీ భాషా స్వరూపమును గురించియు దాని ఉద్దేశమును గురించియు రాజ్యాంగశాసనములో స్పష్టముగా ఈ దిగువ విధముగా నిర్దేశింపబడినది."

"భారతీయ సమిష్టి సంస్కృతిని వికసింపజేయుటకు అనుకూలముగానే హిందీ భాషాభివృద్ధి జరుగవలెనుగాని ప్రత్యేక ప్రాంతీయ హిందీ భాషాభివృద్ధిని గురించికాదు."

"ప్రతి ప్రాంతములోను వేఱు వేఱు ఆచారములు, వ్యవహారములు, ఆహార నియమములు, దుస్తులు, సాహిత్యము, కావ్యములు, కళలు గలవు. భారతీయ హిందీ వానినన్నిటిని అభివ్యక్తము చేయునట్టిదిగానే యుండవలెను. ఆ విధముగా వ్యాపకరూపము యేర్పడకపోయినయెడల భారతీయ ఐక్యత సంభవము కాజాలదు. ప్రాంతీయ హిందీ భాషా వాదులు తమ హిందీని అన్యప్రాంతీయులపయి చొప్పించు చున్నారను నింద రారాదు. భారతీయ ఐక్యతకు అది బాధాకరముగా పరిణ మించును. కనుక భారతీయ హిందీ, ఉత్తరప్రదేశపు హిందీకంటె భిన్నముగా నుండును. వేఱు వేఱు ప్రాంతముల భాషా సంప్రదాయములు భారతీయ హిందీలో నుండగలవు. అంతేగాక వేఱు వేఱు ప్రాంతములలోని హిందీకూడ వేఱు వేఱు రూపములతో ఉండవచ్చును. దీనికి ఎవరును భయపడనక్కఱలేదు. ఇట్టి భిన్న రూపములుగల హిందీ ఏర్పడుటకు అవకాశమున్నది. అట్లు జరిగినయెడల పరస్పర ప్రేమ సౌజన్యములు వృద్ధిపొందగలవు."

ఇంత రాద్ధాంతము జరుగుచున్నప్పుడు కాంగ్రెసు కార్య సమితివారు ఈ భాషా విషయములు స్పష్టముగా నిర్దేశింపవలసి

యున్నారు. అందువలన 1954 ఏప్రిలు 4 వ తేదీన వారు దీనిని గురించి రెండు ముఖ్య తీర్మానములు చేసియున్నారు.* వానిని బట్టి భాషా స్వరూపమెట్లుండవలెనో స్పష్టముచేయబడినవి. ఆ తీర్మానములలో ప్రధానముగా బోధనామాధ్యమమును గుఱించియు పబ్లికు సర్వీసు పరీక్షలను గుఱించియు కూడ స్పష్టమయిన నిర్దేశములు గలవు. ప్రాంతీయ భాషలను వృద్ధిచేయవలెననియు, రెండు హిందీ భాషలను వికసింప జేయవలెననియు ఆ తీర్మానములలో చెప్పబడినది.

బోధనామాధ్యమమును గుఱించి బొంబాయి గవర్నమెంటువారు చేసిన పనులను ఇక్కడ వివరించెదను. యూనివర్శిటీలో హిందీ బోధనామాధ్యమముగా ఉండవచ్చునా, కూడదాయని ఆ గవర్నమెంటువారు తమ రాజ్యములోని యూనివర్శిటీలన్నిటికిని వ్రాసియున్నారు. అక్కడి ప్రజలే గాకుండ, ఉపాధ్యాయులును, యూనివర్శిటీలు సయితము ఆ పద్ధతిని అంగీకరింపక తిరస్కరించియున్నారు. బోధనామాధ్యమముగా ప్రాంతీయ భాషలే ఉండవలెననియు, హిందీ రెండవ నిర్బంధ భాషగానుండవలెననియు ఆ యూనివర్శిటీలవారు తీర్మానించుకొని ఆ గవర్నమెంటుకు తెలియజేసియున్నారు.

ఈ విషయమయి పార్లమెంటులో గూడ చర్చ జరిగినది. 1954 ఏప్రిలు నెలలో శ్రీ పురుషోత్తమదాసు టండనుజీ, శ్రీ సేఠ్ గోవిందదాసుజీ పార్లమెంటులో మాట్లాడుచు, "ఉర్దూ విదేశ భాష. ఆ భాషను ప్రోత్సహించిన యెడల భారతీయ సంస్కృతికి దెబ్బ తగులును" అని వక్కాణించిరి. రాజ్యాంగ శాసనములోని హిందీ భాషను గురించి దృష్టిలో పెట్టుకొని చూచినయెడల హిందీ సాహిత్య సమ్మేళనమువారు చేయుచున్న హిందీ భాషా ప్రచారము

*అవి 6 వ అనుబంధములో చెప్పబడినవి.

తప్పని తెలియగలదు. ఆ సంగతి పై ఉభయనాయకుల ఉపన్యాస ములను బట్టియే తెలియగలదు. "ఉర్దూ కూడ హిందీలోని భాగమే అనియు, అది హిందీలోని ఒక శైలి విశేష"మనియు శ్రీ టండనుజీ చెప్పిన రోజులు కూడ గలవు. హిందీని గురించి గాంధీజీ చేసిన నిర్వచనమును అంగీకరించుటయు వారును వీరును కలిసి పని చేయుటయు కూడ జరిగినది. అట్లు జరుగుట వలన హిందీభాష మన జాతీయ జీవనములో ప్రధాన స్థానము నాక్రమించియున్నది. ఇప్పుడు టండనుజీ ఉర్దూ భాష వేఱనియు, అది విదేశీ భాష అనియు చెప్పుచున్నారు. అట్లు చెప్పుటవలన ఉర్దూ, గుజరాతీ మొదలగు ఇతర ప్రాంతీయ భాషలవలెనే హిందీ కూడ ఒక చిన్న ప్రాంతీయ భాష అయిపోయినది. ఈ విషయము రాజ్యాంగ పరిషత్తులో క్షుణ్ణముగా చర్చింపబడినది. రాజ్యాంగ శాసనము లోని షెడ్యూలులో హిందీ, ఉర్దూ ఈ రెండు భాషలు వేఱు వేఱు ప్రాంతీయ భాషలని నిర్దేశించుటతో ఈ తగాదా అంతటితో మాసి పోయినది.

351 టవ సూత్రప్రకారము హిందూస్తానీకూడ ప్రత్యేక భాషగా పేర్కొనబడినది. హిందీ ఇండియా గవర్నమెంటువారి వ్యవహార భాషయని స్పష్టము చేయబడినది. ఈ జాతీయ భాషా హిందీ స్వరూపమును గురించి కొన్ని శంకలు, సందేహములు కలుగుటకు అవకాశమున్నది. అందువలన జాతీయ హిందీ, ప్రాంతీయ హిందీకంటె ఏవిధముగా భిన్నమయినదో రాజ్యాంగ ములో స్పష్టముచేయబడినది. అట్లు జరిగినప్పటికిని హిందీ సాహిత్య సమ్మేళనమునకు చెందిన పై నాయకులిరువురు

పై విధముగా పార్లమెంటులో మాట్లాడియున్నారనగా ఆ పద్ధతిని మనము ఆమోదింపజాలము.

కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీవారు ఈ భాషా సమస్యను గుఱించి ఏకాంత చర్చలు జరిపియున్నారని పత్రికలలో ప్రకటింప బడినది. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ఆ సమావేశములో మాట్లాడి యున్నారు. ఈ ప్రధానవిషయమును గుఱించి వారు ఎన్నో అంశములు చెప్పియున్నారు. "రాజ్యాంగ శాసనములో ఈ భాషా సమస్య పరిష్కరింపబడినది. దీనిని గుఱించి చక్కని నిర్దేశము చేయబడినది. ఇదియొక అఖండ విజయము. ఈ చిక్కు విషయ మును గుఱించి ఇంతమంది యీవిధముగా ఆమోదించుట చాల సంతోషించదగు విషయము. 'మీరందఱు ఇది చేయుటలేదు. అది చేయుటలేదు' అని ఉత్తరభారతీయులు గొంతెత్తి చెప్పుచుందురు. దానివలన ప్రయోజనమేమియులేదు. హిందీ భాష రెండు విధ ములుగ నున్నది. ఒకటి ప్రాంతీయ హిందీ. అది మిగిలిన ప్రాంతీయ భాషలవంటిదే. రెండవది రాజ్యాంగములవా రంగీక రించిన వ్యవహారభాష. ఈ రెండును ఒక విధముగా భిన్నమ య్యును కొంతవఱకు ఏకరూపమును సయితము కలిగియుండును మీరు మీ ప్రాంతీయభాషను (హిందీని) సమృద్ధము చేసికొనదలచి యున్నారు. ఆ వికాసమంతయు మీరు రాజ్యభాషపయి ప్రవేశపెట్టిన యెడల, అది ఇతరులకు అర్థముగాకుండపోవును. అయితే రాజ్య భాష, భిన్న భిన్న భాషల సమాహారమని ( కలయిక ) మీ రూహింపరాదు. భిన్న భిన్న భాషలను కృత్రిమముగా చేర్చిన యెడల అపకారమే జరుగును. ఈ భాషల కలయిక నాకు అంగీ

కారమే. అయితే అవి సహజసృజనముతోను సహజ వికాసము తోను పరస్పరము కలసి పోవలెను. అంతేగాని కృత్రిమపద్ధతి పనికిరాదు." అని పండిత జవహరులాలు చెప్పినట్లు 17-5-54 టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికలో ప్రకటింపబడినది.

## 10. ఉపసంహారము

*రాజ్యాభాషా కమిషను :*

హిందీ ప్రచారోద్యమమును మొదటినుండియు సమీక్షించి యున్నాము. రాజ్యాంగసూత్రము 344 ననుసరించి రాష్ట్రపతి, 1955 లో రాజ్యభాషాకమిషనును నియోగించియున్నారు. ఆ కమిషనుకు వప్పగించిన పని స్పష్టమయినది. వెంటనే ఆచరింపదగినది అయియున్నది. ఆ కమిషను చేయవలసిన పనులు ఈ క్రింది విధముగా చెప్పబడినవి.

"ఆ కమిషనువారు ఈ దిగువ విషయములను గుఱించి రాష్ట్రపతికి సిఫార్సులు చేయవలసియున్నారు.

1. యూనియనువారి రాజ్య వ్యవహారములలో ఏ క్రమము ననుసరించి హిందీ భాషను ప్రవేశపెట్టవలెను.

2. యూనియను రాజ్యవ్యవహారములలో ఇంగ్లీషును ఎన్నిటిలో తీసివేయవలెను. అన్నిటిలోనా, కొన్నిటిలోనా ?

3. 348 సూత్రములో చెప్పబడిన వ్యవహారములకు ఏ భాషను ఉపయోగింపవలెను.

4. ఏయే యూనియన్ వ్యవహారములలో, ఏయే సంఖ్య లుపయోగింపవలెను.

5. ఇంగ్లీషును తీసివేసి హిందీని, యూనియను రాజ్యభాషగా వ్యవహరించుటకును, కేంద్రమునకును ప్రాంతములకును మధ్య వ్యవహారభాషగా హిందీని ఉపయోగించుటకును కాలము నెట్లు నిర్ణయించెదరు ? ఏయే ప్రకారముల ఆ భాషను ఉపయోగింపవలెను.

6. భారతదేశములోని పారిశ్రామిక, సాంస్కృతిక, వైజ్ఞానిక వికాసములను అహిందీ ప్రాంతములలోని వారికిని, పబ్లికుసర్వీసు కమిషనుకును గల సంబంధమును గుఱించియు మనస్సులో పెట్టుకొని కమిషనువారు తమ సిఫార్సులు చేయవలసి యున్నారు.

1956-60 ల కాలములో హిందీభాషా ప్రయోగమును గుఱించి కమిషనువారు ఈపాటికే తమ సిఫార్సులు అందజేసి యున్నారు. మరల 1960-65 లలో ఎట్లు వ్యవహరించవలసినది మఱియొక భాషాకమిషను ఏర్పడి, సిఫార్సుచేయగలదు.

విద్యాసంబంధమయిన చిక్కులు విడదీయుట భాషా కమిషనువారి పనికాదు. ఆ పని రెండు విద్యాకమిషనులు చేసి యున్నవి.

రాధాకృష్ణన్ కమిషనువారు యూనివర్సిటీ విద్యను గుఱించియు, మొదలియారు కమిషనువారు సెకండరీవిద్యను గుఱించియు తమ సిఫార్సులను అందజేసియున్నారు. విద్య ప్రాంతీయ ప్రభుత్వ విషయము. అది ప్రాంతీయభాషలతో సంబంధముగలిగినట్టిది. ఇప్పుడు భాషాప్రాంత నిర్మాణము జరిగినది గనుక ప్రాంతీయ భాషలను సమృద్ధముచేయుట ప్రాంతీయ ప్రభుత్వముల బాధ్యత అయిఉన్నది. రాజ్యాంగ నిర్మాతలును అదే కోరుచున్నారు. ప్రాంతీయ భాషలను, యూనియను హిందీని వృద్ధిచేయుటకు నూఱు విధముల పాటుపడవలసియున్నది. అప్పుడు గాని ఇంగ్లీషను తగ్గించుటకు వీలుండదు. ఈలోపుగా మనలో కొందఱు ఇంగ్లీషను అభ్యసించి, దానివల్ల గలుగు లాభమును జాతీయాభ్యుదయమునకయి వినియోగింపగలరు.

## 11. భావి కార్యక్రమము

జాతీయ హిందీని అంతర్ప్రాంతీయ భాషగాను, వ్యవహార భాషగాను వృద్ధిపొందింపవలసిన కర్తవ్యము కేవలము అహిందీ ప్రాంతీయులవారిదే కాదు. ఈ విషయమయి హిందీ ప్రాంతీయుల కర్తవ్యమును ప్రధానమయియున్నది. అహిందీ ప్రాంతీయులు హిందీని నేర్చుకొనుట తమ విధియని తలంపవలెను, అట్లయినను తమ ప్రాంతీయభాషలు వృద్ధిపొందుటలో అంతరాయమేమియు ఉండదనియు, అవి ప్రాంతీయ వ్యవహారములకును, ప్రాంతీయ విద్యా సంస్థలలోను ఉపయోగింపబడగలవనియు వారికి విశ్వాసము కలుగవలెను. వారు తమ ప్రాంతీయ భాషలద్వారాను, హిందీ ద్వారాను ఇంగ్లీషు వ్యవహారమును తీసివేయవలెను. హిందీ ప్రచారము చేయు సాధనములను గుఱించి ఆలోచించుటకు వారు తమ హిందీ సాహిత్య పరిషత్తులను ఏర్పఱచుకొనవలెను. ఆ పరిషత్తులకు ప్రాంతీయ భాషలే ఆధారముగా నుండగలవు. అవి తులనాత్మక అధ్యయనమునుసైతము చేయగలవు. అట్లు జరిగినయెడల మన భాషలు వేగముగా వృద్ధిపొందగలవు. అంతేగాక అంతర్ప్రాంతములలో ఐకమత్యము, సమన్వయముసైతము ఏర్పడగలవు.

*హిందీప్రాంతీయుల కర్తవ్యము :*

హిందీప్రాంతీయుల కర్తవ్యమును ప్రధానమయినదే. వారు తమ హిందీ సాహిత్య సమ్మేళనము, హిందుస్తానీ అకాడమీ, నాగరీ ప్రచారిణీసభ మొదలయిన హిందీ సంస్థల ద్వారా తమ

ప్రాంతీయ భాషయగు హిందీని ఇతర ప్రాంతీయభాషల వలెనే తమ ఇష్టమువచ్చినట్లు వృద్ధిపొందించుకొనదగుదురు. 351 సూత్రములలో ఉదాహరించిన నిర్దేశములను సయితము వారు పాటింపదగుదురు. తమ భాషా సంప్రదాయములయిన హిందీ, ఉర్దూ భాషలనుండియు ప్రాంతీయభాషలయిన భోజపురి, అవధి, బుందేలి, రాజస్థానీ మున్నగువానినుండియు ఒక సరళభాషను వృద్ధిచేయదగుదురు. అట్లు చేసినయెడల వారు తమ భాషకే మేలుచేసినవారు కాగలరు. హిందీ యూనియను భాషగా కూడ వృద్ధిపొందవలసియున్నది గనుక, ఈ విషయములోకూడ వారు తమ కర్తవ్యమును గుర్తింపవలెను. వారు తమ తమ ప్రాంతీయ హిందీని, అహిందీ ప్రాంతములలో వ్యాపకముచేయునట్టి పనిని మానుకొనవలెను. ఆ ప్రచారము ఇప్పుడు అవసరములేదు. అట్టిప్రచారము జరిగినయెడల అహిందీ ప్రాంతములవారికి కోపము కూడ రాగలదు. ప్రాంతీయ భాషలవారు తమ తమ భాషలను వృద్ధిచేసికొని, మిగిలినవారితో మైత్రిని పెంపొందించుకొని దేశాభ్యుదయమునకయి పాటుపడదగుదురు.

1956 ఫిబ్రవరి నెలలో బీహారు హిందీ సాహిత్య సమ్మేళనము జరిగినప్పుడు శ్రీ రామధారీసింహ దినకరు మాట్లాడుచు హిందీ ప్రాంతములవారికి హితోపదేశమును గావించియున్నారు.

"హిందీని రాజ్యభాషగా చేయుటతో హిందీ మాతృభాషగా గలిగినవారికి చాల సదుపాయము లున్నవిగనుక, వారు తమ సంఖ్యాబలముతో, తమ భాషను మిగిలిన దేశమందంతట బలవంతముగా ప్రవేశపెట్టగలరను అభిప్రాయము అహిందీప్రాంతీయుల మనస్సులో నాటుకొనిపోయినది. హిందీప్రాంతీయులమయిన మనము ఆ పని చేయగోరుటలేదు. అయినను అనుమానము పెనుభూతముగా

ఉండనేఉన్నది. అందువలన మనము ఆ విషయములో మౌనమునే ధరించి, ఆ అనుమానమునకు చోటులేదనిన్ని, రాజ్యభాషానిర్మాతలు అహిందీప్రాంతీయుల వారే యనిన్ని నిరూపింపవలసియున్నది. హిందీ మాతృభాషగా గలిగిన మనము ఇతరులకంటె ఘనులమనిన్ని, ఉత్తమజాతీయవాదులమనిన్ని అనుకొన్నయెడల అది పొరపాటే కాగలదు.

మనము మఱియొక దృష్టితో ఆలోచింతము. హిందీని నిర్బంధము చేయవలెనా, లేదా? స్వతంత్రభారతములో ప్రజారాజ్యము స్థాపింపబడినది. ప్రజారాజ్యములో అధికసంఖ్యాకులమాటయే చెల్లుబడి కాగలదు. భాష, మతము, సంస్కృతి మొదలగు ప్రధాన విషయములలో అధికసంఖ్యాకులుగా నున్నవారు, అల్పసంఖ్యాకుల వికాసమునకు నిండుగా అవకాశములను ఇచ్చితీరవలెను. యావద్భారతదేశములోను ఒక్కటే భాషను అమలుజరిపెదమని చెప్పుట పొసగనిమాట. అయితే భారతీయులందఱము కలిసిమెలసి మిత్రభావముతో నుండుటకు సిద్ధముగా నున్నాము. అంతేగాక ఇంగ్లీషునకుబదులుగా హిందీని ప్రవేశపెట్టుటకును ఇష్టపడుచున్నాము. అందువలన నిర్బంధమువల్ల గాక, ప్రజల అంగీకారముతోనే మనము రాజ్యభాషను వ్యాపింపజేయవలసియున్నాము.

మనము హిందీని మన మాతృభాషగా వికసింపజేసికొనుటకు సర్వాధికారములు గలవు. అయితే కేంద్రభాష యగు హిందీ వ్యాపనమునకు మనము నాయకత్వము వహింపరాదు. కారణమేమనగా కేంద్రభాషయగు హిందీని హిందీ మాతృభాషగా గల మనము ఒక్కరమే గుత్తకు పుచ్చుకొనియుండలేదు. అది యావద్దేశీయ భాష. అందువలన ఆ భాషావ్యాపనమునకు మనము మాత్రమే పూనుకొన్నయెడల, దీనిలో ఏదో అపాయము ఉన్నదని అహిందీప్రాంతీయులు భయపడుదురు. హిందీని నిర్బంధము చేసినయెడల ఉత్తరదేశీయులు దక్షిణదేశీయులను అణగద్రొక్కగలరను అనుమానములు బయలుదేరును."

బీహారు వాస్తవ్యులును, సుప్రసిద్ధ పండితులును, కవులును, ఆచార్యులును అయిన శ్రీ రామధారీసింహ దినకరు చెప్పినమాటలు యథార్థములు. హిందీ మాతృభాషగా గలవారికి అట్టి దురభిప్రాయములు లేకపోవుగాక. అయినను అట్టి అనుమానము లున్నచోట వాని రాహిత్యమునకు ప్రయత్నముచేయుట హిందీ ప్రాంతీయుల

కర్తవ్యమయి యున్నది. మన ప్రధానమంత్రి సెలవిచ్చినట్లు రాజ్యభాషానిర్ణయము పరమాద్భుతమయినది. మహావిజ్ఞాన వేత్తలు, రాజకీయ ధురంధరులు కూర్చుండి రాజభాషాసమస్యను సర్వోత్తమముగా పరిష్కరించియున్నారు. కనుక ఆ రాజ్యభాషను మనము జాగ్రత్తగా కాపాడుకొనవలెను. ప్రాంతీయ హిందీ వాదులు సంకుచితభావములవల్లను, హిందూ సంస్కృతిని తిరుగ దోడవలెనని తీవ్రవాదము చేసెడి హ్రస్వదృష్టిగలవారివల్లను, రాజ్యభాషయగు హిందీకి ముప్పు గలుగకుండ చూచుకొనవలెను. అట్లు జాగరూకత వహింపనియెడల ఏబదిసంవత్సరములనుండి చేయుచున్న జాతీయభాషా ప్రచారము వ్యర్థమయిపోగలదు.

స్వరాజ్యము వచ్చినందుకుగాను, దానికి మంచి రూపము ఏర్పడుటకు ఈ జాతీయభాషావికాసము అత్యుత్తమ సాధనముగా నుండగలదు. "యావద్భారత వ్యవహారములకుగాను మనము ఇంగ్లీషు భాషను విడిచిపెట్టరాదు. ఉంచుకొనవలసినదే" అని కొందఱు వాదించుచున్నారు. అయితే భాషామాధ్యమముగా ఇంగ్లీషునకు బదులు హిందీ ఉండవలెననియే హిందీప్రచారోద్యమ లక్ష్యముగాని ఇంగ్లీషు భాషా జ్ఞానమువల్ల గలుగు లాభములను విడనాడవలెననికాదుగదా! ఇంగ్లీషు అంతర్ప్రాంతీయభాషగా ఇంకను వ్యవహరింపబడినయెడల సామాన్య ప్రజల ఆత్మగౌరవమునకు భంగకరముగా వర్తించుటయే కాగలదు. ప్రజారాజ్యము లోని సామాన్య ప్రజలు తమ మాతృభాషలద్వారా పూర్ణ వికాసము పొందుటకు హక్కు గలిగి ఉన్నారు. ప్రజావ్యవహారములలోను, ప్రాంతీయ రాజ్య వ్యవహారములలోను మాతృభాషలు వ్యవహ

రింపబడవలెను. అది ప్రజల హక్కు. ఇంగ్లీషు తెలిసినవారు ఈసంగతిని ఎంత శీఘ్రముగా గుర్తించిన అంతమంచిది. మనలో కొంతమందికి ఇంగ్లీషు వచ్చును. దానిని ఇప్పుడు మఱచి పోజాలము. సుమారు నూటయేబది సంవత్సరములనుండియు మనదేశములో ఇంగ్లీషుబోధన, అభ్యాసము జరుగుచున్నప్పటికిని మనలో నూటికి ఒక్కరికి కూడ ఆ భాష బాగుగా పట్టుపడినదని చెప్పలేము. ఇంగ్లీషు పరిపాలనను ఈ దేశములో అంతమొం దించుట భారతజాతీయోద్యమప్రధానలక్ష్యమయి యుండుటయే గాక భారతీయుల సాంఘిక, రాజకీయ, విద్యావ్యవహారములను క్రుంగదీయుచున్న ఇంగ్లీషు భాషామాధ్యమమును తొలగించు టయు ప్రధానలక్ష్యముగానేయుండెను. ఇంక నేను ముగించెదను. ముగించుటకు ముందు మనజాతి జనకులయిన శ్రీ గాంధీజీ ఈ విషయములలో ఏమిచెప్పియున్నారో వివరించెదను. వారు దీనిని గుఱించి ఏనాడో 1921 లో 'యంగిండియా' పత్రికలో ఇట్లు వివరించియున్నారు.

"ఇంగ్లీషు భాషతో పనిలేకుండ భారతీయుల మనస్సు మహోన్నతవికాస మును పొందగలుగునట్లుండవలెను. ఇంగ్లీషు భాషాజ్ఞానము లేనియెడల ఉత్తమ నాగరికుల మనిపించుకొనము అని మన బాలురకును, బాలికలను బోధచేయుట వల్ల మన దేశమందలి పురుషులకును ముఖ్యముగా స్త్రీలకును ఘోరాపచారము చేసినట్లే యగును. అటువంటి సంకల్పము కలిగియుండుట ఎంత అవమానకరమో చెప్పజాలను. స్వరాజ్యమునకు కావలసిన ప్రధానాంశములలో ఇంగ్లీషు భాషా వ్యామోహమును తొలగించుట ఒకటి."

(యంగిండియా 2-2-1921)

"ఇప్పుడు జరుగుచున్న ఇంగ్లీషు బోధనా పద్ధతిని చూచినయెడల దాని మూలమున ఇంగ్లీషు విద్య నేర్చిన భారతీయుల ఉన్నతి గిడసబాఱిపోయినదని

తెలియగలదు. భారతీయ విద్యార్థులు ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఎంతో ప్రయాసపడు చున్నారు. వారు తమ శక్తినంతయు వినియోగించుచున్నారు. అంతేగాక ఎన్నో విదేశపద్ధతులను అనుకరించుచున్నారు. బ్రిటిషుపాలనవల్ల మనకు జరిగిన ఘోర మైన అన్యాయములలో ఒకటి యేమనగా, మాతృభాషలకు బదులు ఇంగ్లీషు భాషా వ్యవహార మేర్పడుటయే. శ్రీ రామమోహనరాయలును, లోకమాన్యతిలకు మహా శయులును తమ అభిప్రాయములను ఇంగ్లీషులోనే భావించుచు ఇంగ్లీషుద్వారానే వ్యవహరించుచుండిరి. అది వారికి అసౌకర్యమే. అట్టి అసౌకర్యమే లేకపోయిన యెడల ఒకరు ఇంతకంటె మహాసంస్కర్తలుగాను, వేరొకరు మహాపండితులు గాను రాణించియుందురు. ఆ ఉభయులును తమ అద్భుతశక్తిని ప్రజల కందించి యుండిరి. అయితే వారు ఇంగ్లీషుకు సంబంధించిన కృత్రిమ వాతావరణములో వ్యవహరించినారని యనవలెను. అట్లు జరిగియుండనియెడల వారి శక్తి ఇంకను నూటింతలుగా పనిచేసియుండెడిది. ఇంగ్లీషు సాహిత్యములోని అమూల్యభండారము వల్ల వా రుభయులకు లాభము గలిగినమాట నిజమే. అయితే వారికి తమ మాతృ భాషలద్వారా ఆ విజ్ఞానము లభించియుండవలసినది. ఏ దేశములోను విదేశీ అను కరణము చేయువారు వృద్ధిపొందరాదు. అట్లు వృద్ధిపొందినయెడల స్వజాతి గౌరవము నిలువదు.

(యంగిండియా 27-4-1921)

## అనుబంధము 1.

(గాంధీజీ "నిర్మాణ కార్యక్రమము" అను పుస్తకము వ్రాసియున్నారు. దాని నుండి ఈ దిగువ భాగము సేకరింపబడినది.)

మనము మన మాతృభాషను ఉపేక్షచేసి ఇంగ్లీషు బాషను ప్రేమించుట మొదలుపెట్టినాము. దాని మూలమున ఇంగ్లీషు చదువుకొన్నవారికిని, రాజకీయదృష్టి కలిగినవారికిని, సామాన్య ప్రజలకును మధ్య ఒక పెద్ద అఖాతము ఏర్పడినది. మనదేశ భాషలన్నియు దరిద్రాణములయి పోయినవి. మన మాతృ భాషలో నిగూఢ విషయములను వెల్లడింపలేక పోవుచున్నాము.

విజ్ఞానశాస్త్ర శబ్దములకు సరియయిన మాతృభాషాశబ్దములు కని పింపవు. దానిమూలమున అంతయు అగమ్యగోచరముగా నున్నది. సామాన్య జనులకును ఆధునికులకును సంబంధమే లేకుండ పోయినది. మహోన్నతములగు భారతీయ భాషలను ఉపేక్షచేసినందువలన మనము దేశమున కెంతహాని చేసియు న్నామో చెప్పజాలకున్నాము. మనవల్ల జరిగిన యీ పొరపా టును సరిదిద్దుకొనని యెడల సామాన్యజనులకు విజ్ఞానప్రబోధ ములు అందనే అందవు. అట్టిచో సామాన్య జనులు స్వరాజ్య నిర్మాణమున కేమియు సాయపడజాలరు. అహింసాత్మకమగు స్వరాజ్య సాధనమునకు ప్రతి ఒక్కరి సహాయము కావలసి యున్నది. అందువలన మనము బోధించు ప్రతిఅంశము సామా న్యులకు తెలిసినగాని వారు స్వతంత్ర పోరాటములో పాల్గొన జాలరు. అట్లు జరుగుటకుగాను మనము వారికి మాతృభాషలలో విద్య బోధింపవలెను.

*జాతీయభాష :*

యావద్భారతీయ వ్యవహారములకుగాను మనకొక భాష కావలెను. అది భారతీయభాష అయియుండవలెను. ఆ భాష అధిక సంఖ్యాకులకు ఈ వరకే తెలిసియుండవలెను. అర్థమగు చుండవలెను. ఇతరులు గ్రహించుటకు అది సులభముగా నుండ వలెను. అటువంటిభాష హిందీ భాష ఒక్కటియే. దానిలో సందేహమేలేదు. ఉత్తరభారతములోని హిందువులును, ముసల్మా నులును ఆ భాషను మాట్లాడెదరు. ఉర్దూలిపిలో వ్రాసినయెడల

దానిని ఉర్దూ అందురు. 1925 లో కాన్పూరులోజరిగిన కాంగ్రెసు మహాసభలో ఈ దేశీయభాష విషయమయి ఒక గొప్ప తీర్మానము ప్యాసుచేసి, ఈ భాషకు హిందుస్తానీయని నామకరణ మొనర్చియున్నారు. నాటినుండి కనీసము సిద్ధాంతరూపములో నయినను మన జాతీయభాష హిందుస్తానీయే. సిద్ధాంతరూపమని ఎందుకనుచున్నాననగా, మన కాంగ్రెస్‌వారే తగిన విధముగా హిందీభాషను అభ్యసించియుండలేదు. భారతీయభాషల ప్రాధాన్యమును గుర్తించుటకు, జాతీయభాషావ్యాపనమునకును 1920 సంవత్సరములో తీవ్రప్రయత్నములు జరుపబడినవి. అవిధముగా కాంగ్రెసు సమావేశములలో వేర్వేఱు ప్రాంతములనుండి వచ్చిన సభ్యులు జాతీయభాషలో సులభముగా మాట్లాడగలుగుదురని ఆశింపబడినది. ఆ జాతీయభాషను రెండు విధములుగాను మాట్లాడవచ్చును. రెండులిపులలోను వ్రాయవచ్చును. పై విధముగా తీర్మానము అంగీకరింపబడినదే గాని, ఏకాంగ్రెసు సభ్యులును దానిని అమలుజరిపియుండలేదు. అందుకు నాకెంతో విచారముగా నున్నది. పైగా వారు ఇతరులను ఇంగ్లీషులో మాట్లాడవలసినదని బలవంతపెట్టుచుండెదరు. ఇదెంతయు సిగ్గుచేటు. ఇంగ్లీషుభాష వలన మనలో ఏర్పడిన నిషా ఇంకను దిగిపోలేదు. ఇంగ్లీషు వ్యామోహములో మునిగియున్నందువలన మనము భారతదేశమును అభ్యుదయ మార్గమున నడపింపలేక పోవుచున్నాము. మనము ఇంగ్లీషుభాషను నేర్చుకొనుటకు ఎన్నిఏండ్లు కష్టపడుచున్నామో, హిందుస్తానీ నేర్చుకొనుటకు అన్ని మాసములు వినియోగించిన చాలును. అట్లు మనము హిందూస్తానీని

నేర్చుకొనని యెడల సామాన్యప్రజలపై మనకు అభిమానము లేదనియే చెప్పవలెను.

## అనుబంధము - 2

1941 డిశంబరు నెలలో 'అబోహార్' అను గ్రామములో హిందీ సాహిత్య సమ్మేళనము వారి సమావేశము జరిగినది. నాకు తెలిసినంతవఱకు ఈ తీర్మానము నేటివఱకు ఏ విధముగాను సవరింపబడలేదు. హిందీ, ఉర్దూ ఈ రెండు భాషలను రాజ్యాంగములోని 8 వ షెడ్యూలులో చేర్పించుటకును జాతీయ భాషయగు హిందీ, హిందుస్తానీని వేఱువేఱుగా 343 సూత్రములోను 351 సూత్రములోను చేర్పించుటకును సమ్మేళనమునకు చెందిన హిందీ భాషావాదులు కృషిచేసినారని చెప్పవలసి యున్నది.

*అబోహారు తీర్మానము :*

నిజమునకు ఉర్దూ కూడ హిందీభాష నుండి ఉత్పన్నమయినదే. కాని అందు అరబ్బీ, పారసీశబ్దములు బహుళముగా నుండును. చారిత్రకముగా చూచినయెడల హిందీ అన్న పదములోనే ఉర్దూ భాష కూడ ఇమిడియున్నది. కాని ఇప్పు డేమయినది ? ఉర్దూ సాహిత్యభాష భిన్నమయిపోయినది. దానితో కొలదిమంది మాత్రమే వ్యవహరించుచున్నారు. ఏమయినను ఆ భాష, హిందీ భాష కంటె భిన్నరూపము గలిగియున్నది కనుక అది హిందీ కంటె వేరుభాష యని సమ్మేళనమువారు గుర్తించుచున్నారు.

హిందీభాష యనగా దేశీయ శబ్దములు అధికముగా గలిగినట్టిది. ఉర్దూ అనగా అరబ్బీ, పారసీ శబ్దములు బహుళములుగా గలిగినట్టిది. ఈ రెండు భాషలు కలిసినట్టిదే హిందుస్తానీ. ఈ రెండు భాషల స్వరూపమును ఒక్కసారిగా నిర్దేశించుటకు ఈ

హిందుస్తానీ శబ్దమును కాంగ్రెసువారును, హిందుస్తానీ అకాడమీ వారును, కొన్ని ప్రభుత్వశాఖల వారును వాడుచున్నారు. కొంత మంది హిందీ ఉర్దూ శైలులు మిశ్రితమైఉన్న భాషకుగూడ హిందుస్తానీ శబ్దమును ఉపయోగించుచున్నారు. ఉర్దూభాషకును, హిందుస్తానీ భాషకును ఈ విధముగా భిన్నార్థములు ఏర్పడినవి. అందుకు సమ్మేళనమువారికి వ్యతిరేకభావము లేదు. అయితే సమ్మేళనము వారు తమ సాహిత్యదృష్టితోనూ, జాతీయదృష్టితోను తమ కార్యకలాపములలోను, తమ సమితులలోను 'హిందీ' పదమునే ఉపయోగించుచు, హిందీ శైలినే ప్రచారముచేయుదురు.

## అనుబంధము - 3

( శ్రీ జవాహరులాలు నెహ్రూ, కాంగ్రెసు ఆర్థిక, రాజకీయ విధానమును గూర్చి ఒక గొప్ప వ్యాసమును వ్రాసియున్నారు. దానినుండి యీ పదిహేడు ప్రధానాంశములను ఉదాహరించుచున్నాను. మో. క. గాంధి )

1. ప్రాంతములలోని విద్యా కలాపములును, ప్రజా వ్యవహారములును ఆ యా ప్రాంతీయ భాషలలో జరుగవలెను. ఆయా ప్రాంతములలోని భాషలు ప్రధాన భాషలుగా నుండవలెను. వ్యవహార భాషలుగా నుండవలసిన భాష లివి: హిందుస్తానీ (హిందీ ఉర్దూ ఈ రెండుకూడ) బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, తమిళము, తెలుగు, కన్నడము, మళయాళము, ఓఢ్రము, అస్సామీ, సింధీ. ఇవిగాక కొంతవఱకు పుష్తూ, పంజాబీభాషలు.

2. హిందుస్థానీ మాట్లాడబడు ప్రాంతములలో హిందీ, ఉర్దూ ఈ రెండుభాషలు నాగరి, ఉర్దూ లిపులతో సహా ప్రాంతీయ

రాజ్యభాషలుగా అంగీకరింపబడవలెను. గవర్నమెంటు ప్రకటనలు రెండులిపులలోను ఉండవలెను. ప్రజలు తమ యిష్టమువచ్చిన లిపిలో గవర్నమెంటువారికి మహజర్లు, దరఖాస్తులు పంపుకొన వచ్చును. వానిని రెండవ లిపిలోకూడ పంపుకొనవచ్చును. వానిని రెండవ లిపిలోకూడ పంపవలసినదని ప్రజలను కోరరాదు.

3. హిందుస్తానీ ప్రాంతములలో హిందుస్తానీయే బోధనా మాధ్యమము గనుక రెండు లిపులను ఆమోదింపవలసినదే. ప్రతి విద్యార్థియు, లేదా అతని తలిదండ్రులు తమకు కావలసిన లిపిని కోరుకొనవచ్చును. రెండులిపులను నేర్చుకొనవలసినదని విద్యా ర్థులను నిర్బంధింపరాదు. కాని మధ్యమ తరగతులలో ప్రోత్స హింపవచ్చును.

4. దేవనాగరి, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ లిపులను ఏక లిపిగా చేసి అచ్చు, టైపు మొదలగు నవీన సాధనలకు ఉపయోగ పడునట్లు కృషిచేయవలెను.

5. సింధీ లిపిని ఉర్దూ లిపిలో కలిపివేసి అచ్చునకు, టైపునకు అనువుగా నుండునట్లు కుదింపవలెను.

6. దక్షిణదేశపు భాషలన్నియు దేవనాగరిలిపిలో ఇముడ్చు టకు సాధ్యమేమో పరిశీలనలు జరుపవలెను. అట్లు సాధ్యపడని యెడల తమిళము, తెలుగు, కన్నడము, మళయాళ భాషలకు ఒక్కటే లిపి ఉండునట్లు ప్రయత్నములు జరుగవలెను.

7. లాటిను (ఇంగ్లీషు)లిపిలో చాల సదుపాయము లున్న ప్పటికిని కనీసము ప్రస్తుతమునకయినను ఆ లిపి మన భారతీయ భాషలకు ఉపయోగపడదు.

మనకు ఈ రెండు లిపు లుండవలెను:

(1) దేవనాగరి, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ సంయుక్త లిపి.

(2) ఉర్దూ, సింధీ లిపి.

దక్షిణభారత భాషలన్నియు దేవనాగరిలో వ్రాయుటకు సాధ్యమయినయెడల సరేసరి. లేనియెడల ఆ నాలుగు భాషలకు కలిపి ఒక లిపి.

8. హిందుస్తానీ ప్రాంతములలోని హిందీ, ఉర్దూభాషలు ప్రత్యేకముగా వికాసముగా పొందుచున్నయెడల మనము చింతపడ వలసిన పనిలేదు. ఆ విధమయిన అభివృద్ధికి మనము అడ్డుతగుల వలసిన పనియులేదు. నూతన నిగూఢాంశములు భాషలో ప్రవేశించు నప్పుడు ఇట్లు జరుగుట సహజమే. ఆ రెండు భాషల వికాసము వల్లను భాషాభ్యుదయము కలుగగలదు. జాతీయభావములును, విశ్వభావములును అలముకొన్నప్పుడు ఈ రెండు భాషలు ఎట్లును ఏకముగాక తప్పదు. ప్రజలలో విద్యాప్రచారము బాగుగా జరిగిన నాడు ఆ భాషలో సమానత్వమును, హుందాతనమును ఏర్పడగలవు.

9. సామాన్యప్రజల శ్రేయస్సును మనస్సులో పెట్టుకొని హిందీ, ఉర్దూ మిగిలిన ప్రాంతీయభాషల వికాసమునకయి మనము గట్టిగా కృషిచేయవలెను. గ్రంథకర్తలు తేలికభాషలో అందఱకు అర్థమగునట్లు సామాన్య ప్రజలకు ఉపయోగకరములగు పుస్తకము లను వ్రాయవలెను. ఆడంబరముతో గూడిన భాషాప్రయోగములను, ఆర్భాటములను మానివేయవలెను. సులభమయిన, స్పష్టమయిన, శక్తిమంతమయిన శైలిని పెంపొందింపవలెను. ఇట్లు జరిగిన

యెడల ఎన్నోలాభములు గలుగగలవు. వానిలో హిందీ, ఉర్దూలు రెండును ఏకమగుట ఒకటి.

11. బేసికు ఇంగ్లీషు ఏర్పడిన పద్ధతి ననుసరించి బేసికు హిందుస్తానీ కూడ నిర్మాణముకావలెను. ఈ భాష చాల సులభముగా నుండవలెను. వ్యాకరణము చిన్నదిగానే ఉండవలెను. శబ్దములు ఒక వేయి కంటె మించి యుండకూడదు. ఇది సమగ్రమయిన భాషగానే ఉండి, సామాన్యముగా మాట్లాడుటకును, వ్రాయుటకును వీలుగా నుండవలెను. ఈభాష హిందుస్తానీ భాషా స్వరూపమునే గలిగియుండవలెను. ఇంకను నిండుగా భాషా పరిచయము సంపాదించుటకును అనువుగా నుండవలెను.

12. బేసికు హిందుస్తానీ మాట అటుండగా హిందుస్తానీ (ఉర్దూ, హిందీలు రెండును) భాషలోను, సాధ్యమయినయెడల ఇతర భారతీయ భాషలలోను ఉపయోగపడునట్లు శాస్త్రీయపదములను, రాజకీయ, వాణిజ్య పదములను మనము ఏర్చి కూర్చుకొనవలెను. అవసరమయినచోట్ల, విదేశీశబ్దములను ఉన్నవి ఉన్నట్లుగానే ఉపయోగించుకొనవలెను. మన భాషలలో నున్న పదములకును జాబితాలు తయారుచేయవలెను. అట్లు చేసినయెడల సాధ్యమయినంతవరకు శాస్త్రీయపదములను నిష్కర్షగాను, సమానముగాను వాడుకొనవచ్చును.

13. ప్రతివిద్యార్థికి, అతని మాతృభాషలో విద్యను బోధించుటకే ప్రాంతీయ విద్యావిధానము అమరి యుండవలెను. ప్రతి రాష్ట్రములోను ప్రాథమికవిద్య మొదలు యూనివర్సిటీ విద్య వఱకును చదువంతయు ఆ ప్రాంతీయభాషలోనే ఉండవలెను.

ఒక భాషారాష్ట్రములోనే భిన్న మాతృభాష గలిగిన విద్యార్థులు తగినంతమంది యున్నయెడల వారికి వారి మాతృభాషలోనే ప్రాథమికవిద్యను బోధింపవలెను. ఇంకను అట్టివారు చాల మంది ఉన్నయెడల వారికి వారి మాతృభాషలోనే మాధ్యమిక విద్యను బోధింపవలెను. అయితే వారు నిర్బంధముగా ప్రాంతీయ భాషను సైతము అభ్యసింపవలెను.

14. అహిందీప్రాంతములలోని మాధ్యమిక పాఠశాలలలో బేసికు హిందుస్తానీని బోధింపవలెను. విద్యార్థులు తమకు కావలసిన లిపిని కోరుకొనవచ్చును.

15. యూనివర్సిటీవిద్యలో బోధనామాధ్యమము, ఆ ప్రాంతీయభాషయే. హిందుస్తానీయును (ఏలిపిలోనైనను) మఱియొక విదేశీ భాషయు నిర్బంధముగా నుండవలెను. టెక్నికలు విద్యలు నేర్చుకొనువారికి అదనపు భాషలు నేర్చుకొనవలెనను నిర్బంధము ఉండరాదు. అయితే అట్లు నేర్చుకొనుట మంచిదని వారికి చెప్పవచ్చును.

16. విదేశీభాషలను, ప్రాచీనభాషలను నేర్చుకొనుటకు మన మాధ్యమిక విద్యాలయములలో అవకాశముండవలెను. అయితే అవి నిర్బంధముగా నుండరాదు. అయితే స్పెషలు కోర్సుల కొఱకును, యూనివర్సిటీలకొఱకును అవసరమయిన యెడల అవి నిర్బంధముగా నుండవచ్చును.

17. ప్రాచీన భాషా గ్రంథములను విదేశీసాహిత్య గ్రంథములను మన భారతీయభాషలలోనికి అనువాదములను విరివిగా చేసికొనవలెను. అట్లు చేసిన యెడల ఆ యా భాషల సంప

ర్శముచవలన మన భాషలు కూడ. వైజ్ఞానికరంగమునను, సాహిత్య రంగమునను వృద్ధిని పొందగలవు.

(హరిజన్ 21-8-1937)

## అనుబంధము - 4.

(శ్రీ గాంధీజీ, రాజేంద్రప్రసాదు మున్నగు మహానుభావులు ఈ దిగువ స్టేటుమెంటును ప్రకటించియున్నారు.)

కాంగ్రెసుమహాసభ, యావద్దేశీయభాషకు హిందుస్తానీ యని నామకరణముచేసియున్నది. అది ఉర్దూ, హిందీభాషలతో మిశ్రితమగు సరళభాష. ఉత్తర భారతములో ప్రతి ఒక్కరు ఈ భాషను మాట్లాడుచు, అర్థముచేసికొనుచుందురు. ఈ దేశములోని ఇతర ప్రాంతములలో కూడ ఈభాషనే వాడుకచేయుచుందురు. హిందీ, ఉర్దూ భాషలు రెండును, ఈ బేసికు భాషకు సాహిత్య రూపములు. ఇవి ఈనాడు రెండు భిన్నధారలుగా ప్రవహించు చున్నవి. ఆ రెండిటిని ఏకముఖముగా చేసి జాతీయభాష యగు హిందుస్తానీని ప్రచారము చేయవలసిన అవసరము ఎంతయినను కనబడుచున్నది. అంతేగాక ఇతరభాషలు వాడుకలోనున్న ప్రాంతములలో గూడ హిందుస్తానీ ప్రచారము చేయవలసి యున్నది. అందువలన మే మొక సంస్థను స్థాపింపదలచి యున్నాము. ఆ సంస్థ, సరళమగు హిందీని, సరళమగు ఉర్దూను కలిపి ప్రచారముచేయగలదు. అందు పనిచేయు కార్యకర్తలు రెండు భాషలను, రెండు లిపులను నేర్చుకొని అవసరమునుబట్టి వాడుకచేయుచుందురు. ఇట్లుచేయుటవలన దేశమం దంతట ఒక సరళభాష అమలులోనికి రాగలదు. అంతేగాక క్రమక్రమముగా

ఈ భాషలో ఉత్తమసాహిత్యము సైతము సృష్టి కాగలదు. ఈ ఉద్దేశములతో నేడు ది 2-5-42 వ తేదీన "హిందుస్తానీ ప్రచార సభ" అను పేరుతో ఒక సంస్థను స్థాపించుచున్నాము.

( ఆ సంస్థ నియమావళిలో ఈ దిగువ ఉద్దేశము వ్రాయబడి ఉన్నది )

ఉద్దేశము : ఈ సంస్థ, జాతీయభాషయగు హిందుస్తానీని ప్రచారము చేయగలదు. భిన్న భిన్న ప్రాంతీయభాషలుగల ప్రాంతములలో ఈ భాషద్వారా వ్యవహారములు జరుపబడును. యావద్దేశములోని సాంఘిక, ఆర్థిక, పరిపాలనాది వ్యవహారములకు ఈ భాషయే వాడుకచేయబడును.

షరా : ఉత్తరభారతములోని పట్టణములలోను, పల్లెలలోను ఉన్న హిందూ ముసల్మానులు వాడుకచేయుభాషయే హిందుస్తానీ. అది నాగరి, ఉర్దూ రెండు లిపులలోను వ్రాయబడుచుండును. హిందీ, ఉర్దూ అనునవి రెండును ఆభాషకు సాహిత్యరూపములు.

## అనుబంధము - 5.

( 1951 లో బొంబాయి రాజ్యములోని "హిందీ టీచింగు కమిటీ" వారు తమ రిపోర్టును ప్రకటించియున్నారు. దాని సంగ్రహమును ఈ దిగువ ప్రకటించుచున్నాము. రాజ్యాంగ శాసనములోని 343-351 సూత్రముల ప్రకారము హిందీ ప్రచారము జరుగవలసిన విధానమును గురించి రిపోర్టు తయారుచేయవలసినదని గవర్నమెంటువారు, ఈ కమిటీవారిని కోరియున్నారు. ఆ ప్రకారమే వారు ఈ సూత్రములను కూలంకషముగా పరిశీలించియున్నారు. వారు తమ నిర్ణయములను తమ రిపోర్టులో రెండు భాగములలో పొందుపఱచియున్నారు. పూనా నగరములోని సుప్రసిద్ధ చరిత్రకారులైన శ్రీ డి. వి. పోద్దారు ఆ కమిటీకి అధ్యక్షులు. వారు సమగ్రమయిన వివరములను వ్రాసియున్నారు. అది మొదటి భాగములో నున్నది. రెండవ భాగమును నేను వ్రాసియున్నాను.) నేను వ్రాసిన వివరముల సారాంశము 23-6-51 వ తేదీగల 'హరిజను' పత్రికలో ప్రకటింపబడినది. శ్రీ ప్రోద్దారు వ్రాసిన విషయమును సంగ్రహపఱచి దిగువ తెలియచేయుచున్నాము.

*1. రాజ్యాంగశాసనములోని ప్రధాన సూత్రములు :*

18 వ భాగము - మొదటి అధ్యాయము - 343 (1) సూత్రము - "యూనియను రాజ్యభాష హిందీ. అది దేవనాగరి లిపిలో నుండును. భారతీయ సంఖ్యల అంతర్జాతీయ రూపము, యూనియను సంఖ్యామానము.

17 వ భాగము - నాలుగవ అధ్యాయము - 351 వ సూత్రము.

( ఇది లోగడ వివరింపబడినది )

*2. హిందీ, ఉర్దూ, హిందుస్థానీ.*

ముందుగా మనము 351 వ సూత్రమును, 8 వ షెడ్యూలును పరిశీలింతము. హిందుస్తానీ భాషలోను, 8 వ షెడ్యూలు లోని ఇతర ప్రాంతీయ భాషలలోను గల ప్రతిభాసంపదకు, రూపమునకు, శైలికి భంగము కలుగకుండ, ఆయా భాషల విశేషములను ఇముడ్చుకొనుచు, రాజ్యభాషయగు హిందీని సమృద్ధము చేయుట యూనియను గవర్నమెంటువారి కర్తవ్యమయి యున్నది. 8 వ షెడ్యూలులో 14 భాషలు గలవు. ఒక్క సంస్కృతము, ఉర్దూ భాషలు తప్ప, మిగిలినవన్నియు ప్రాంతీయభాషలు. ఈ పండ్రెండు భాషలలోను హిందీ కూడ ఒకటి. అది మిగిలిన బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, కన్నడ భాషలతో పాటుగానే చెప్పబడినది. కాబట్టి ఆ హిందీ ప్రాంతీయభాష యనుటకు సంశయమేలేదు. దానికిని మిగిలిన ప్రాంతీయభాషలకును ఏ విషయములోను తేడాలేదు. ప్రాంతీయ భాషలలోని విశేషములను ఇముడ్చుకొనుచు

వృద్ధిపొందునది కేంద్రభాషయగు హిందీ. 8 వ షెడ్యూలులోని హిందీ ప్రాంతీయభాష. ఈ విధముగా మనము అర్థము చెప్పినప్పుడే 351 వ సూత్రమునకు సమన్వయము కుదురును. లేక పోయినచో కుదరదు.

351 వ సూత్రములో హిందుస్తానీ పేరుకూడ చేర్చబడినది. ఆ పక్షములో మొత్తము 15 భాషలు కాగలవు. వానిలో హిందీ, ఉర్దూ, హిందుస్తానీలు మూడును భిన్నభాషలుగా నుండగలవు. మిగిలిన ప్రాంతీయ భాషలతో పాటు, ఈ మూడింటి సహాయము వల్లను రాజ్యభాష యగు హిందీ సమృద్ధము కావలసియున్నది.

ఈ మూడు భాషలవిధులు ఏ విధముగా నున్నవో విచారింతము. రాజ్యాంగశాసనములో ఈ అయిదు విషయములు స్పష్టముగా చెప్పబడినవి.

1. 343 సూత్రములో చెప్పబడిన రాజ్యభాషయగు హిందీ లేక అఫీషియల్ హిందీ.

2. 351 సూత్రములో సమృద్ధము కావలసిన రాజ్యభాష యగు హిందీ.

3. 8 వ షెడ్యూలులో చెప్పబడిన ప్రాంతీయ భాష యగు హిందీ.

4. 351 సూత్రములో ఉదాహరింపబడిన హిందుస్తానీభాష.

5. 8 వ షెడ్యూలులో చెప్పబడిన ఉర్దూభాష.

ఈ అయిదు భాషలును అక్కచెల్లెండ్రని వేతే చెప్పవలసిన పనిలేదు.

## 3. ఉన్నత హిందీ (Higher Hindi):

ఉత్తరప్రదేశములోని పశ్చిమ ప్రాంతములోను, తూర్పు పంజాబులోను హిందీభాష జన్మించి వృద్ధిపొందినదని డాక్టరు సునీతికుమార చటర్జీ చెప్పుచున్నారు. ఈ ప్రదేశము భారతదేశమునకు హృదయపీఠము వంటిదని శ్రీ చటర్జీ చెప్పుచున్నారు. హిమాలయములకును వింధ్యపర్వత శ్రేణికిని గల మధ్యభాగమునకు ఆర్యావర్తమని పేరు. ఈ సంగతి సంస్కృతవిద్వాంసులందఱు ఆమోదించుచునేయున్నారు. ఉత్తరప్రదేశములోని పూర్వప్రాంతీయులు గాని, పశ్చిమ ప్రాంతీయులు గాని ప్రాంతీయభాష యగు హిందీని వికసింపజేసియున్నారు. డాక్టరు చటర్జీ మహా హిందీ అను పదమును వాడినపుడు, ఆ భాష యీ ప్రాంతీయ భాష యగు హిందీయే అయియున్నది, వేఱుకాదు.

## 4. ఉన్నత ఉర్దూ (Higher Urdu):

8 వ షెడ్యూలులో 14 వ అంశముగా చెప్పబడిన ఉర్దూ విషయములో గూడ ఇట్లే సమాధానము చెప్పవచ్చును. ప్రారంభదశలో ఉర్దూకును, హిందీకిని భేదము ఉండెడిదికాదు. ఈ రెండును "ఖడీ బోలీ" అను గ్రామీణ హిందీభాషనుండి పుట్టినవే. రానురాను ఒకదానిలో అరబ్బీ, ఫారసీ శబ్దములను అధికముగా చేర్చినప్పుడు దానికి ఉర్దూ యని పేరువచ్చినది. దీనికే "జబానే ఉర్దూయే ముహల్లా" అనగా మహా ఉర్దూయను పేరు వచ్చినది. 351 వ సూత్రము ప్రకారము రాజ్యభాషయగు హిందీని వికసింప

జేయుటకు ఈ మహాఉర్దూకూడ సాయపడవలసియేయున్నది. ఈ విధముగా స్వతంత్ర భారత రాజ్యభాషయగు హిందీభాషాభ్యుదయమునకు సంస్కృతభాష యెట్లవసరమో అరబ్బీ, ఫారసీ శబ్దజాలములుగల ఉర్దూ కూడ అట్లే అవసరము. కనుకనే దానిని 8 వ షెడ్యూలులో చేర్చియున్నారు.

*5. హిందుస్తానీ :*

హిందుస్తానీ భాషారూపము ఎటువంటిదో 351 వ సూత్రములో చెప్పబడియుండలేదు. 8 వ షెడ్యూలులో హిందీయని, ఉర్దూయని ఏవిధముగా పేర్లుమాత్రమే ఉదాహరింపబడినవో, ఆవిధముగానే హిందూస్తానీ యనికూడ వాడబడినది. హిందీ, హిందూస్తానీ, ఉర్దూ అను ఈ మూడు భాషలకు మాతృస్థానము ఒక్కటే. మూడింటికిని సమానలక్షణములేకలవు. మూడింటికిని మూల వ్యాకరణము ఒక్కటే. మహాహిందీయనియు, మహాఉర్దూయనియు రెండు ప్రత్యేక భాషలుగా వికాసము పొందినప్పుడు వాని స్వరూపములును భిన్నమయిపోవుచున్నవి. మహావిద్వాంసులు మాత్రమే ఈ భిన్నరూపములను ఆశ్రయించియుందురు. కాని సామాన్యజనులు హిందుస్తానీయని చెప్పబడు సామాన్యభాషనే ఆశ్రయించియుందురు. స్వరాజ్యము వచ్చినతరువాత సామాన్యజనులకే అధికారములన్నియు సంక్రమించియున్నవి. వారే భారత దేశమునకు యజమానులు. కనుక వారి ద్వారా అనగా వారి హిందుస్తానీ భాషద్వారా 351 సూత్రములో చెప్పబడిన హిందీ సమృద్ధముకాగలదు.

*6. కేంద్ర రాజ్యభాషయగు హిందీ :*

ఇంతవఱకును గవర్నమెంటు వ్యవహారములన్నియు ఇంగ్లీషులో జరుపబడుచుండెను. ఇంతటినుండియు రాజ్యభాష యగు హిందీలో జరుపబడవలెను. మధ్యలో బ్రిటిషువారి పరిపాలనయే లేకపోయినయెడల మనదేశములో ప్రాచీనసంప్రదాయము ననుసరించి ఒక క్రొత్తమార్గము త్రొక్కియుండెడివారమే. కాని బ్రిటిషువారు తమ అసాధారణ ప్రజ్ఞావిశేషములతో క్రొత్త క్రొత్త పుంతలు నిర్మించి మిక్కిలి సమర్థతతో రాజ్యపాలనను సాగించియున్నారు. అందువలన భారతీయుల ప్రజ్ఞాబలము అడుగున కప్పబడి పోయినది. ఏమయినను భారతీయుల ఆత్మ మరణించి యుండలేదు. అందువలన అది తిరిగి తలయెత్తినది. కనుకనే నవభారత రాజ్య నిర్మాణము జరిగియున్నది. ఇప్పుడు విశ్వ మానవ కల్యాణమునకై నవభారతదేశము కృషి చేయుటకయి పూనుకొన్నది.

అట్లు చేయుటకుగాను నవభారతదేశమునకు ఒక సమృద్ధ మయిన, తేజోవంతమయిన భాష కావలసియున్నది. అట్టి భాష యేర్పడుటకు లోపమేమియు జరుగదు. 8 వ వివరణ పట్టికలో చెప్పబడిన 14 భాషలు 14 రత్నభండారములు. కనుక యీనియను గవర్నమెంటువారు తమకు కావలసిన శబ్దజాలములను, పై భండారముల సహాయముతో సృష్టిచేసికొనవచ్చును. ఈ విధముగా నూతన శబ్దజాలములతో ఏర్పడిన హిందీ పరిపాలనా వ్యవహారములకు పనికివచ్చును. పరిపాలనాశాఖలలో తొట్రుపాటులేకుండుటకుగాను ఒక్కటే ఒక సాంకేతిక శబ్దముల పట్టిక యుండవలెను.

విద్య యనగా విద్యయే. బోధ యనగా బోధయే. ఖచ్చితమయిన శబ్దములు ఖచ్చితముగా వాడుకచేయవలెను. ఇట్టి స్పష్టమయిన హిందీ అధికారహిందీగా నుండగలదు. ప్రభుత్వశాఖలకు విలక్షణ మైన నామకరణములు చేయబడియుండును. ఫారములు, ప్రొసీజర్లు, లాలు, ఆక్టుల, బిల్లులు, రిజల్యూషనులు, నోటిఫికేషనులు, ట్రీటీలు, డిక్లరేషనులు ఈ మొదలయిన వానికి స్పష్టమయిన శబ్దములను సృష్టింపవలెను. ఇంక సందేహములకు, తొట్రుపాటునకు చోటుండరాదు. ఇది పరిపాలనకు పనికివచ్చు అఫీషియల్ హిందీ, లేక రాజ్య భాషయగు హిందీ.

*7. దేశీయభాషయగు హిందీ :*

ఇప్పుడు 351 వ సూత్రములో నిర్దేశింపబడిన హిందీని గుఱించి వివరించుట సులభము. దీని స్వరూపము, దీని ఉద్దేశము అత్యంత విశాలము, అత్యంత వ్యాపకమయినవి. దీని స్వభావము హిందీలోని ఏ రూపమునకును లేదు.

(అ) మహాహిందీ అనగా ప్రాంతీయహిందీ, ఉత్తర ప్రదేశములోని మూడు, నాలుగు కోట్ల జనులకు స్వభాషగా నుండగలదు. దానిని ఏ హద్దులలోను బంధించుటకు వీలులేదు. ఆ భాష ఎంత మహోన్నతిని పొందదలచిన యెడల అంత మహోన్నతిని పొందవచ్చును.

(ఆ) మహాఉర్దూ, 8 వ షెడ్యూలులో ఉదాహరింపబడిన భాష ఏ ప్రాంతములోను ప్రాంతీయభాషగా నుండకపోయినను, కొందఱు జనులకు స్వభాషగా నున్నది. ఇకముందుకూడ అట్లే ఉండగలదు. భారతదేశమునకు వెలుపల కొన్ని ప్రాంతములలో

కూడ ఆ భాషకు గౌరవస్థాన మేర్పడియున్నది. అందువలన ఈ నూతన స్థితిగతులలో ఆర్థిక, వ్యాపార, రాజకీయాది సంబంధము లను కొనసాగించుటకు గాను ఆ భాషా వికాసము అవసరమే కాగలదు. దానికి మతప్రాధాన్యము కూడ గలదు. ఆ విధముగా దాని ఉపయోగమును బట్టి ఆ భాష వృద్ధిపొందుచుండగలదు.

(ఇ) హిందుస్తానీ తేలికభాష. అది ఇరువదికోట్ల జనుల వల్ల వాడుక చేయబడుచున్నది. స్వరాజ్యము రాకమునుపు, అది యించుమించుగా జాతీయభాష అయిపోయినదనియే చెప్పవచ్చును. ఆ భాష కోట్లకొలది జనులకు ఎంతో ఆధార భూతముగా నుండె డిది. ఇప్పుడు స్వరాజ్యము వచ్చినది. మనము స్వతంత్రులము గనుక మన అవసరములు, బాధ్యతలు నూఱురెట్లు పెరిగిపోయి నవి. మనము అభ్యుదయ మార్గమున అడుగులో అడుగు కలుపు కొనుచు ముందునకు అతి శీఘ్రముగా సాగిపోవలెను. మన భారతజాతి విఖ్యాత మయినది. మన జాతిలో చాలమంది విఖ్యాత పురుషులు విలసిల్లియుండిరి. కనుక ఆ పరంపరను కొనసాగింప వలసియున్నాము. ఆ దృష్టితో మనము మన భావిజీవితమును ఉజ్జ్వలముగా నిర్మించుకొనవలెను. అట్లుచేసి విశ్వములో నొక గౌరవజాతి యనెడి ప్రతిష్ఠను గడించుకొనవలెను.

(ఈ) పరిపాలనా భాషయగు హిందీ స్వరూప స్వభావా దులు పైన వివరింపబడినవి.

ఇక జాతీయ భాషయగు హిందీ స్వరూప స్వభావాదులను గుఱించి తెలిసికొనవలెను. ఆ భాష భారతీయులందఱకు వ్యవహార భాష. మన నాయకులకు, మంత్రులకు, రాజదూతకు, రాయ

బారులకు, విద్వాంసులకు, ఉపాధ్యాయులకు. సంపాదకులకు, పత్రికా విలేఖరులకు, రేడియోవారికి, రైతులకు, కూలీలకు, ఇంకను ఇతరులకు ఉపయోగించునట్టిది. మహాసభలలో, సమితి సమావేశములలో, రాజ్యాంగాది చర్చలలో వినియోగపడునట్టిది. ఈ హిందీ భాష అన్నిభాషలను ఇముడ్చుకొనునట్లుగాను, వ్యాపకముగాను ఉండవలెను. సంకుచితముగాను, అసంబద్ధముగాను ఉండకూడదు. ఈ భాష అత్యంత సులభముగాను, నిరాడంబరముగాను, అందఱకు అందుబాటులో నుండునట్లుగాను ఉండవలెను. తమకు కావలసిన పదజాలమును ఎక్కడనుండి యయినను తెచ్చుకొనవచ్చును. అందుకు ఎవరిని చూచి భయపడవలసిన పనిలేదు. అట్లు స్వీకరించుటకు సందేహింప నవసరములేదు. ఆ భాష తొందరగా అందఱకు రావలెను. అందఱకు సులభముగా అర్థము కావలెను. ఇదే ప్రధానోద్దేశముగా నుండవలెను. ఈ ఉద్దేశము నెరవేరిన యెడల దేశవిదేశభేదములనుగాని, మత, మతాంతర భేదములనుగాని పాటింపవలసిన పనిలేదు.

*8. సమ్మిశ్రిత సంస్కృతి :*

(అ) 351 వ సూత్రములో జాతీయభాషా వికాసమును గుఱించి చెప్పబడినది సరే. అంతేగాక భారతీయ సమ్మిశ్రిత సంస్కృతిని పెంపొందింపవలెననెడి ఆదేశముకూడ అందే పొందుపఱుపబడినది. ఆ భాష సర్వజనులకు వ్యవహారమాధ్యమముగా నుపయోగపడవలెను. అందులకుగాను ఆ భాష సర్వతోముఖాభివృద్ధిని సాధింపవలెను.

(అ) భారతీయ సంస్కృతి సమ్మిశ్రితమయిన సంగతి, నిర్వివాదాంశము. అది సమ్మిశ్రితమయినదని చెప్పినప్పుడు దానిలో అనేకధారలు చేరియున్నవనుటయేగదా. అట్టి వివిధధారలకు వ్యవహారమాధ్యమముగా నుపయోగపడునట్లుగానే జాతీయభాషా వికాసము జరుగవలెనని 351 సూత్రములో నిర్దేశింపబడినది.

(ఇ) భారతీయ సంస్కృతి అనేకవందల సంవత్సరముల నుండి పెరుగుచు వచ్చినది. అందు సంస్కృత, ప్రాకృత, ప్రాంతీయ, అరబ్బీ, పారసీక, ఇంగ్లీషుభాషాసంప్రదాయములు చేరియున్నవి. అది భిన్నభిన్న ప్రాంతములలో వేలువేలు రూపములతో కూడియున్నది. ఈ సమ్మిశ్రిత ప్రవాహములో స్థానిక సంప్రదాయములు చారిత్రికాంశములు సైతము చేరియున్నవి. ధర్మప్రవక్తలు, కవులు, స్మృతికారులు, వేదాంత నిపుణులు ఈ సమ్మిశ్రిత సంస్కృతిని ప్రోదిసేయుటకు పదివేల విధముల పాటుపడిరి. భారతజాతి బాల్యమును వీడి యౌవనము పొందినది మొదలు పెక్కండ్రు ధార్మికప్రవృత్తిగల మహానుభావులు ఈజాతి ప్రజలను ఉదారులుగా, శాంతిప్రియులుగా, న్యాయవంతులుగా, చట్టబద్ధ జీవులుగా మనుటకు ప్రబోధించి, ప్రజాజీవితమును సరిదిద్దియున్నారు. అందువలన భారతజాతి ప్రజలు సత్పురుషులనందఱను సోదరభావముతో ఆదరించి, స్వాగతమిచ్చి, తమదేశంలో తల దాచుకొనుటకు తావును కల్పించియున్నారు. ఈ విధముగా భారత దేశములో అద్భుతమయిన సంస్కృతి నిర్మితమయినది. అందు అనేక ధారలు చేరియున్నవి. భారతీయులు ఆ సమ్మిశ్రిత సంస్కృతిని వేయివిధముల వికసింపజేసికొనుచు వచ్చుచున్నారు. "మీరు

సుఖముగా ఉండండి. మమ్ములను సుఖముగా ఉండనీయండి." ఇదే వారి సిద్ధాంతము.

(ఈ) ఈ మిశ్రితసంస్కృతిని ప్రోదిచేయుటకొరకే మనము ఐకమత్య సాధనకు కృషి చేయవలసియున్నాము.

(ఉ) కేంద్రభాషగా నిర్దేశింపబడిన హిందీ భారతీయుల విభిన్న సంస్కృతిధారలను వ్యక్తముచేయుటకు అనువుగానే వృద్ధిపొందవలసి యున్నది. కనుక మనము మన పిల్లలకు పాఠ్య క్రమములు నిర్ణయించునప్పుడు గాని, పాఠ్యపుస్తకములను నిర్ణయించునప్పుడు ఇంకను ఇటువంటివే ఇతర సందర్భములలోగాని ఈ ఉద్దేశమును ఎన్నడును విస్మరింపరాదు.

*9. హిందీభాషా వికాసము :*

హిందీ స్వతంత్రభారతమునకు జాతీయభాష. స్వరాజ్యము వచ్చినవెనుక మన బాధ్యతలు, మన కార్యప్రణాళికలు దినదినము వృద్ధిపొందుచున్నవి. ఈ వ్యవహారము లన్నిటికి ఉపయోగపడు నట్లుగా మన జాతీయభాషా వికాసము జరుగవలెను. ఆ భాష యందు శక్తిసమర్థతలు ఏర్పడవలెను. ప్రతి ఒక్కరును, స్త్రీపురుషులు, బాలవృద్ధులు, సంపన్నులు, నిర్ధనులు ఆ భాషను మిగుల ప్రేమతో అభ్యసింపవలెను.

ఆ భాష శక్తిహీనమయినది, అసమర్థమయినది అన్న పేరు రారాదు. ఆ భాష సంపన్నముగా నుండుటకుగాను, రాజ్యాంగ శాసనములో 15 ఆధారములు చూపబడినవి. 8 వ పట్టీలో పదు నాలుగు భాషలును, సూత్రములోనే హిందుస్తానీ యని పదునేనవ

భాషయు చెప్పబడినది. అంతేగాక రాజ్యాంగములో ఇంకను సావకాశములు ఇవ్వబడినవి. 351 వ సూత్రములోని చివరిభాగ ములో భాషావికాసమునకు మఱికొన్ని మార్గములు చెప్పబడినవి. "పదజాలము కావలసినపుడు, ప్రధానముగా సంస్కృతమునుండి గ్రహింపవలెను. రెండవ పక్షములో ఇతర భాషలనుండి గ్రహింప వచ్చును" అని.

సంస్కృతము మన పరంపరానుగతమగు భాష. దీనికి అద్భుతమగు శక్తి గలదు. శతశతాబ్దములనుండి మనలను నిలబెట్టి నది. ఆ భాషయే కనుక ఆభాషలో మనకు దొరకనిశబ్దము ఉండదు. అందుండి శబ్దములు గ్రహించుటకు మనకు సందేహము గాని, తొట్రుపాటు గాని అవసరము లేదు. నవ్యప్రపంచము నవ్య నవ్యమార్గములలో అత్యంత వేగముతో ముందునకు సాగిపోవు చున్నది. ఒకవేళ ఏ కారణమువల్లనయినను మనకు కావలసిన పదజాలము సంస్కృతములో గాని మన ప్రాంతీయ భాషలలో గాని ఉపలబ్ధము గానియెడల మనము "ఇతర భాషల" నుండి తెచ్చుకొనవచ్చునని రాజ్యాంగము నిర్దేశించుచున్నది. "ఇతర భాషలు" అన్న పదము అర్థవంతమయినది. గమనింపుడు. ఈ భాషలకు పట్టిక యివ్వబడలేదు. కనుక ఇవి విశ్వములోని ఏభాష లయినను కావచ్చును. అందువలన మనకు ఏ శబ్దము కావలసిన దానిని మనము ఏ భాషనుండి యయినను తెచ్చుకొనవచ్చును. మన భాషలలో మనకు కావలసిన శబ్దము సరియయినది దొరకని యెడల అరబ్బీ, పారసీ, ఇంగ్లీషుభాషలనుండి తెచ్చుకొనుటకు మనకే ఆక్షేపణయులేదు. అంతేకాదు చైనా, రష్యా శబ్దములను

కూడ తెచ్చుకొనుటకు సావకాశము కల్పింపబడినది. ఈ విధముగా జాతీయ భాషావికాసమునకుగాను మహోదారమైన మార్గములు చూపబడినవి. 351 వ సూత్రాభిప్రాయ మిదియే.

హరిజన్ 17-4-1954

## అనుబంధము 6.

ఇండియను నేషనలు కాంగ్రెసు కార్యవర్గమువారు ది 4-5-1954 వ తేదీన ఢిల్లీలో సమావేశమయి సుప్రసిద్ధమైన ఈ దిగువ తీర్మానమును చేసియున్నారు.

*1. బోధనా మాధ్యమము :*

విద్యాలయములలోను, కళాశాలలలోను ఉండవలసిన బోధనా మాధ్యమమును గుఱించిన కాంగ్రెసు వారి విధానమును మాటిమాటికి తెలియ బఱచబడియున్నది. ఈ విషయమై కాంగ్రెసు కార్యవర్గమువారు ది. 5—6—1949, 17—5—1953 లలో జరిగిన తమ సమావేశములలో తీర్మానములు చేసియున్నారు. రాజ్యాంగ శాసనములలో హిందీ జాతీయ భాషగాను, ఇతర ప్రాంతీయ భాషలు ప్రముఖ భాషలుగాను అంగీకరింపబడినవి.

కనుక ప్రభుత్వమువారు తమవిద్యాలయముల ద్వారాను, ఇతర విధములను హిందీభాషను జాతీయభాషగాను, ప్రాంతీయ భాషగాను కూడ అభివృద్ధి పొందింపవలెను. రాజ్యాంగములో ఉదాహరింపబడిన ఇతర భాషలను సర్వ విధముల వికసింపజేయ వలెను. ఆయా భాషల అభివృద్ధిద్వారా భారతీయ వాఙ్మయము పెంపొందవలయును. ఆయా భాషలును పరస్పరము మధుర సంబంధము గలిగియుండవలెను. ఇది మన ధ్యేయము.

హిందీ జాతీయభాష గనుక పాఠశాలలోను, కళాశాలల లోను వేఱు వేఱు తరగతులలో నిర్బంధముగా బోధింపబడ వల యును. హిందీ భాషాప్రాంతములలోనివారు మఱియొక భార తీయ భాషనయినను తప్పక అభ్యసింపవలయును.

భారతదేశములో హిందీ, ఇంగ్లీషు స్థానమును ఆక్రమింప గలదని గుర్తించుకొనవలయును. అట్లయినను విదేశీ సాహి త్యముతోను, విదేశీ విజ్ఞాన, వ్యాపార, రాజకీయాది విషయము లతోను సంబంధము గలిగియుండుటకుగాను, విదేశ భాషల పరి చయము మనకవసరమే. అట్లు జరుగుటవలన భారతీయభాషలును, సాహిత్యమును పెంపొందగలవు.

ఆసియా, అయిరోపాలలోని ప్రధాన విదేశీభాషను నేర్చు కొనుట అవసరమే య్యును, ప్రపంచభాషలలో ముఖ్యమయిన దగుటవల్లను, వెనుకటి సంబంధములవల్లను ఇంగ్లీషు నేర్చుట కూడ అవసరమే.

ప్రాథమిక తరగతులలో చిన్న బిడ్డలకు తల్లిదండ్రుల అభిరుచి ననుసరించి మాతృభాషలలో విద్యగఱపుటయే ప్రధానము. సామాన్యముగా ఆ భాష ఆప్రాంతములోని ప్రాంతీయభాషయే అయియుండును. కొండప్రాంతములలో ప్రాథమిక తరగతులలో బోధనా మాధ్యమము అక్కడి ప్రాంతీయభాష అయియుండగలదు.

పెద్దపెద్ద నగరములలోను, ప్రాంతములలోను ప్రాంతీయ భాషగాక వేఱువేఱు భాషలు మాట్లాడువారు సయితము ఉందురు. అట్టివారు తగినంతమంది ఉండి, తమకు మాతృభాషద్వారా విద్యా బోధన కావలెనని కోరినయెడల వారికిగాను పబ్లికు ప్రాథమిక

పాఠశాలలను స్థాపింపవలెను. ద్విభాషా ప్రాంతములలోను, ముఖ్యముగా రెండు రాష్ట్రముల సరిహద్దులలోను ఆ ప్రాంతములలోని రెండు భాషలలోను ప్రాథమిక విద్యను బోధింపవలెను.

మాధ్యమిక విద్యాలయములలో సాధారణముగ ప్రాంతీయ భాషయే బోధనా మాధ్యమముగా నుండగలదు. తగినంతమంది విద్యార్థులున్న యెడల ఇతర భాషలలోను విద్యాబోధ జరుగవలెను. మాధ్యమిక విద్యాలయములలో, హిందీ సార్వదేశికభాషగనుక నిర్బంధముగా రెండవభాషగా బోధింపబడవలెను.

విశ్వవిద్యాలయములలో ప్రాంతీయభాషవిద్యామాధ్యమము. అట్లయ్యును హిందీని కూడ ఉపయోగించుకొనవచ్చును. ఉపాధ్యాయులు హిందీలోను, అప్పుడప్పుడు ఇంగ్లీషులోకూడ తమ పాఠములను బోధింపవచ్చును. అది జరిగినయెడల అంతర్ప్రాంతీయ సంస్కృతిసంబంధములు అభేదముగా నడచిపోగలవు.

ఇక వైజ్ఞానిక, సాంకేతిక విషయములను బోధించునప్పుడు బోధనామాధ్యమము ఇంగ్లీషునుండి హిందీలోనికిగాని, ప్రాంతీయ భాషలలోనికిగాని మాఱునప్పుడు, ఆ మార్పు క్రమానుగతముగా నుండవలెనుగాని, బోధనావిషయముల శ్రేణి అమాంతము దిగజాఱునట్లుండరాదు. మధ్యకాలములో హిందీ లేక ప్రాంతీయభాష లేక ఇంగ్లీషు, బోధనామాధ్యమములుగా నుపయోగించుకొనవచ్చును. ఇందు దోసమేమియులేదు.

ఒక విదేశీభాషాపరిచయముకూడ అవసరమే గనుక దానిని హైస్కూళ్ళలో మొదలుపెట్టి, కళాశాలలలోనికి తీసికొనిపోవలెను.

కేంద్ర ప్రభుత్వములోని విద్యాశాఖవారు, ఇంగ్లీషునకు బదులుగా హిందీని ప్రవేశపెట్టుటకుగాను అయిదు సంవత్సరముల అంచెలవారీగా పదునయిదుసంవత్సరములు నిర్ణయించియున్నారు. ఆ నిర్ణయమును ఈ కాంగ్రెసు కార్యవర్గము వారు సామాన్యముగా అంగీకరించుచున్నారు.

## 2. అఖిలభారత సర్వీసుపరీక్షల మాధ్యమము :

రాజ్యాంగశాసనములో హిందీని జాతీయభాషగా అంగీకరించి ఇంగ్లీషునుండి హిందీలోనికి మారుటకుగాను పదునయిదు సంవత్సరముల కాలవ్యవధిని సయితము నిర్ణయించియుండుట వలన అఖిలభారతసర్వీసుపరీక్షలలో క్రమముగా హిందీని ప్రవేశపెట్టుట అవసరము.

ఈ మార్పు క్రమముగా నుండవలెనేగాని అహిందీ ప్రాంతములలోని అభ్యర్థులకు శ్రమకలుగునట్లుగా నుండరాదు. హిందీభాషలో ప్రాంతీయభాషలును వికాసముపొందుటకు తగినన్ని అవకాశములు ఇవ్వబడును. అంతేకాక ఉన్నతోద్యోగములు కావలసిన వారికి విదేశీభాషలును, ముఖ్యముగా ఇంగ్లీషు భాషాభ్యాసమును అవసరమే.

అఖిలభారత సర్వీసు పరీక్షలలో క్రమక్రమముగా హిందీ, ఇంగ్లీషు, ప్రాంతీయభాషలు ఉపయోగింపబడగలవు. పరీక్షార్థులు తమ పరీక్షలలో ఈ మూడింటిలో దేనిలోనయినను పరీక్ష యివ్వవచ్చును. ఒక పరీక్షార్థి హిందీలోగాని, మాతృభాషలోగాని పరీక్ష

ఇచ్చినయెడల అతడు వేఱుగా ఇంగ్లీషులోకూడ పరీక్ష ప్యాసు కావలెను.

ఈ పరీక్షలలో పాల్గొను అభ్యర్థులు అందరు ప్రారంభ దశలో హిందీలో సైతము ఉత్తీర్ణులు అయితీరవలెను. వారు లోగడ పరీక్షలలోనే హిందీలో ఉత్తీర్ణులయిన యెడల మరల అవసరములేదు.

ఈ పరీక్షలలోని రెండవ దశలో అభ్యర్థులు హిందీనిగాని, ఇంగ్లీషునుగాని ప్రాంతీయభాషలన్నిగాని తీసికొనవచ్చును. అయితే అహిందీప్రాంతములలోని పరీక్షార్థులకు ఒక హిందీ ప్రశ్నపత్రము నిర్బంధముగానుండును. హిందీ ప్రాంతములవారికి ఒక భారతీయ భాషాపత్రము నిర్బంధముగా నుండును. హిందీలోను ఇతర ప్రాంతీయభాషలలోను పరీక్ష యిచ్చిన పరీక్షార్థులకు ఇంగ్లీషు నిర్బంధముగా ఉండితీరును.

ఈ విధముగా హిందీ అఖిలభారతసర్వీసుపరీక్షలలో క్రమముగా ఇంగ్లీషు స్థానమును ఆక్రమింపగలదు.

(హరిజను 17-4-1954)

★

## మా ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | గాంధీ చరిత్రము .... | 2 | 4 | 0 |
| 2. | నెలవంక .... | 2 | 0 | 0 |
| 3. | తెలుగు వ్యాసములు .... | 1 | 8 | 0 |
| 4. | కథాతోరణము .... | 2 | 0 | 0 |
| 5. | శ్రీకృష్ణ రాయబారము .... | 1 | 8 | 0 |
| 6. | హిమబిందు (నవల) .... | 2 | 8 | 0 |
| | (శ్రీ అడివి బాపిరాజుగారు) | | | |
| 7. | కావ్యతోరణము .... | 1 | 8 | 0 |
| 8. | ప్రహ్లాద చరిత్రము .... | 1 | 8 | 0 |
| | (సంకలనం : శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు) | | | |
| 9. | ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము (నాటకములు) .... | 1 | 8 | 0 |
| | (అనువాదం : శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు) | | | |
| 10. | 'దేశభక్త' కొండ వెంకటప్పయ్య పంతులు స్వీయచరిత్ర 1 వ భాగం .... | 2 | 1 | 0 |
| | 2 వ భాగం .... | 2 | 1 | 0 |
| 11. | గాంధీజీ విద్యార్థి జీవితము .... | 0 | 8 | 0 |
| 12. | వ్యాసరత్నావళి .... | 2 | 0 | 0 |
| | (సంకలనం : శ్రీ పిలక సూర్యప్రకాశరావుగారు) | | | |
| 13. | నెహ్రూ చరిత్ర .... | 2 | 8 | 0 |
| | రచయిత : శ్రీ కొమాండూరి శఠగోపంగారు | | | |

స్రవంతి (తెలుగు సాహిత్య మాస పత్రిక)

వార్షిక చందా రు 3-00 లు   విడి ప్రతి 0-25

ప్రతులకు :

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

959 ఖైరతాబాద్, హైదరాబాద్ - 4